

కర్త:
ఏటుకూరి వెంకటనరసయ్య



భర్త:
క్రొత్త సుబ్బయ్య చౌదరి

కీలమున్ బట్టిన నాఁటినుండియు నెదో
కళ్యాణ మాశించు నా
వలకేల్ చేసిన పుణ్యమేమొ ? యిదియే
వాంఛింతు నిజన్మకున్
హాలమున్ బట్టిన నాఁటి దృశ్యములు ప్ర
త్యక్షమ్ములై నాతలం
పులగిల్గింతలు పెట్టుచుండు ననిశం
బున్ దీరుతీయంబులన్.

# శీర్షికలు

# ఆభాషణములు

ద్రాదా పీమకుటములలో ముక్కాలు మువ్వీసము నా కవితాభ్యాసమున కయ్యు నిటీవలి కావ్యధోరణి కెంతయు నుపకరించినది. అదిగా నీచిల్లర పనితనము వెలార్ప నాట్టె మనస్కరింప లేదు.

అయిన నేఁటి తోరంజాలుసంబోక తప్పినదిగాదు. లేదేని వీని కీరూప మేర్పడి యుండకపోను. ఇంతకుఁ గాలాభిరుచి గడవరానిది గదా ?

ఇందలి వానకారు, పెంగ్కి మొదలగు ఖండికలు లక్ష్మణమూర్ఛ, లంకాదహన మిత్యాదులబలెఁ గొందఱు కంఠస్థముచేసి పలుచోట్లఁబాడవింటిని. అటయు నీ జతనమున కుపాశ్రయమైనది.

పాఠకున కందిపుచ్చుకొనుటకుఁగాఁ దొలిపాయలో జిజ్ఞాసాతరంగములు, మలిపాయలో జీవితతరంగములు, మూఁడవపాయలో సాంసారిక తరంగములు నొకే రేవున కయిన వాని ననుసంధించితిని.

లోఁగడఁ బ్రకటితములగు కొన్ని శీర్షికలలోఁబాటు నవసరములగుమార్పు లెడనెడఁ గావించితిని.

ఈ ఖండకృతులఁ బ్రకటించి నా యుత్సాహ మొసఁగొల్పిన పత్రికలకును వీని నచ్చునకుఁ దేరఁబుటకొల్పిన సారస్వతమండలికిని గృతజ్ఞుఁడను.

పూజ్యమిత్రులు శ్రీ. పి. లక్ష్మీనారాయణగారు (లక్ష్మీ పవర్ ప్రెస్ ప్రొప్రయిటరు) దీని ప్రథమావతరణమునకుఁ గారకులైరి. కాన వారిసాహిత్య సౌమనస్యముల కభినందనములు.

గ్రంథకర్త.

# కృతిపతి

## శ్రీ క్రొత్త సుబ్బయ్య చౌదరిగారు

నేఁ గనిపించుచేటే తడవు నిల్చిన నీయెడ లెల్లఁ గన్నులై
త్రాగెద వంతకంత కనురాగ సుధాబ్ధి తరంగ పంక్తులన్
దోఁగెద వాక్కపెట్టున మృదుస్మిత చంద్రికలన్ వెలార్తువో
మూఁగమునీంద్ర! నాహృదయమున్ గదలించిన విట్టిఘట్టముల్.

త్యాగము గాదు నాచెఱఁగుఁ దన్పిన దన్యదురాసదక్రియా
భోగము గాదు నాదుతలఁపుల్ బులిపించిన దాత్మచింతనో
ద్యోగము గాదు నాహృదయ మూఁపిన దింత కపూర్వనైతిక
శ్రీ గరిమమ్ము నాకనులఁ జిందిన దొందిన దిట్టి సత్కృతిన్.

గువ్వల చెన్నఁ డేకరణిఁ గొల్చెనొ ? వాఁకిటి తిమ్మఁడే జరీ
దువ్వట మిచ్చెనో ? మనకుఁ దోఁపదు కీర్తిగడించి రాకథల్
త్రవ్విన నీ విచిత్రచరితమ్ములకున్ సరి దాఁటు చున్నవే
పువ్వుల పూజ సల్పి యిటు పుట్టితివో ? స్వకులైక దీపకా !

నాకృతికన్య నిత్తునను నమ్మిక మున్నదె ? ధర్మవృద్ధులన్
జేకొనుఁ గాని చెన్నఁటులఁ జేరదు సద్గుణభూషణాదుల
య్యాకృతి కత్తుకొల్పు విషయాంతర మొల్ల దసాధువర్తనుల్
లోకుల కెత్తు రుల్లముల లోఁతులు పాతు లెఱుంగ నేర్తురే ?

దొరమీసము చిఱు గాడుపుఁ
దరఁగలఁ ద్రూఁగాడ దొడ్డి దాపునఁ బసిక్కై
చెరలాడు సింహరాజము
కరణి న్నిన్నప్పుడపుడు గని వినుతింతున్.

బెడఁగారు నీరు కావుల
కొడలి పసందులకు వియ్య మున్నది పోని
మ్మ్రుదుగని వానల నెండల
నడ యాడు శరీర మింత నవకము చెడదే ?

కనిపించిన సుఖ ముంటికే ?
యని కేల్మోడ్చెదవు వెంట సంటున వెటనే
పనియున్న బెఱుఁగ వీదృశ
వినయ వివేకమ్ము లాత్మ విస్మితిగొలుపున్.

ఆత్మబంధువు శివలింగ యాభి ధానుఁ
డేమధుర వేళ ననుబంధ మేర్పరించె
నాచెలిమి చిమ్మలై చిల్పలై తరంగ
లై మనోభూము లొయ్యొయ్య నవఘుళించె.

బాబులు సుఖులని మనరవి
బా బవుడప్పుడు వచించు పట్టులఁ బేరున్
సాఁబా లెటెఁగించితివని
ప్రాబంధిక బంధకవన భంగి నగింతున్.

గనిమ కాడలయల్లికల పసందులకు నీ
కందోయి మిసమిసల్ కలవరించు
జలవేణికాభంగ సంగీతములకు నీ
శ్రవణ సమ్మోదమ్ము జాలువాఱు
నవ్యకేదార ఖండవిలాసములకు నీ
చిత్త మాంధుర్యమ్ము చివురుదొడుగు
ప్రబలపయోద వప్రక్రీడలకును నీ
నిలువు నిక్షేపమ్ము పులకరించు

గడ్డి పూమొల్కలొల్కు సింగారములకు
నార్ద్రహృదయము చిదుముట కనుమతింప
దీ ప్రకృతి దృశ్యములకు ద్రవించునతఁడు
కవియొ ? శిల్పియొ ? రసికుఁడో ? కర్షకుండొ ?

చేయి మీఱఁదలంకు జ్యేష్ఠకుమారుండు
వేంకటేశ్వరుఁడు వివేకధనుఁడు
తెప్పవోలెనటించు రెండవసూనుండు
జగపతి సాహిత్య చక్రవర్తి
కనుసన్ననడయాడు కడగొట్టు పుత్రుండు
రఘురాముఁ డతిథి పరాయణుండు
పుత్రికామణు లన్నపూర్ణాయశోదలు
నాల్కకుఁ దొడవైన నడకవాఱు

అడుగు దప్పక కొల్చు నర్ధాంగలక్ష్మి
నాగరత్నాంబ నిరుపమత్యాగశీల
బంధుమిత్రులు ముక్కోటి బలఁగ మట్లు
కొలువ కులపతి వనిపించుకొంటి వన్న !

నీకష్టార్థము క్షేత్రలక్ష్మీముఖ మందే కాంతు మశ్రాంతమున్
నీకారుణ్యము కాపురెడ్లభుజ మందే చూతు మీరీతిగా
నీకైంకర్యము పూజ్యపూజనసుఖులందే తాండవ మ్మాడు నో
లోకారాధకుఁడా ! సధర్ములకె చెల్లున్ గావ్య కళ్యాణముల్.

వివిధ విఖ్యాతచరితులఁ దవులుకంటె
గుప్త చరితులకొండాట గుణముకాదె ?
ఉన్నవాఁడున్నవాని కి ల్లూడ్చిపెట్టు
అన్యుల మొగమ్ము సూచుపుణ్యమునఁబోఁడు

కృతి పతుల జీవితమ్ము వర్ణించుపట్లఁ
గవుల గంటాలఁ బట్టఁ బగ్గాలు గలవె ?
ఏయసత్కల్పనలకుఁదావీని వ్యక్తు
లాత్మ సౌందర్యమును మాత్ర మభిలషింత్రు.

దివ్యకీర్తి కైన దేవదేవున కిచ్చి
తనప్రతిష్ఠ నిలుపఁ దరమెకవికి
నిన్నువంటి నరుల నెన్నికకుం దెచ్చి
విశ్వమున్న దనుక వెలయు టొప్పు.

క్రొత్త వంశమునకుఁగూర్చు ప్రజ్ఞానిధు
లుత్తమాధికారు లుండి రందు
జగ్గకవికి నీకు సాహిత్యపూజలు
జరిపినాఁడ వీలు మెఱసినాఁడ.

క్రమ మింతైన గణింప కాత్మ కథలన్ గాలింప కాంతర్యమ
ర్మము లేవో గమనింప కీకరణి సంభావించితిన్ గావునన్
దమిదీఱన్ విలిఖింప లే నిపుడు చింతాదంతురస్వాంతుఁడన్
రమణీయమ్ముభవచ్చరిత్రము బుధారాధ్యమ్ము ముమ్మాటికిన్.

ఓ సుబ్బయాగ్రణీ ! యా
సాసలఁ గ్రుంకని త్రివేణి కధినాథుఁడవై
యాసూర్యచంద్ర తారము
భాసిల్లుమ ఖండకావ్యపటహధ్వనులన్

---

# ౧ పాయ

## భారతము

భారతజాతి సభ్యతకుఁ బొల్పడి సూటికి నూఱుపాళ్లు నో
రూరని వారు లేరు వినవోయి? సముజ్జ్వలరత్నగర్భ నీ
భారతభూమి దీనిపసపట్టక మిన్నులు నడ్డుచోట ని
ట్టూరుతురా? పరాయులు ప్రయోజనశూన్యుఁడ వీవొకండవే.

అనుమానింపకు మాకళింపు మొకరష్యాదేశ మాసాంతమున్
మినహాయించినఁ దక్కు యూరపు కంటెన్ మేల్తరమ్మిండియా
జనసంఖ్యా విషయప్రసక్తి నయినన్ చైనాకు దీటైన దం
చనకా? నల్వదికోట్లు భారతప్రజల్ సామాన్యసామ్రాజ్యమా?

స్తుతిగా దీశ్వరుఁడైన మెచ్చువలె హిందూదేశ నైసర్గిక
స్థితి కత్యున్నతపీఠభూములు, మహాద్రిశ్రేణులున్, నిమ్నగా
తతులున్, లోయలు, దుర్గమాటవులు, మైదానమ్ము లీభారత
క్షితికిన్ బెట్టనిసొమ్ము లీవిభవమున్ గీర్తించె దిగ్వ్యూహముల్.

తనగర్భమ్ము పెకల్చినన్ ఖనిజసంతానమ్ము ప్రత్యంతర
మ్మునఁ జప్పిల్లు సమర్థులేని మనస్వాముల్ స్వర్గఖండమ్మె లోఁ
గొనవచ్చున్ దమ ధర్మమున్ మఱచి దిక్కుల్ వట్టి రీకారణ
మ్మున ఖండాంతరవస్తువాహినులు మిమ్మున్ముంచె నొక్కుమ్మడిన్.

జలపాతమ్ము లనేకముల్ గలవు నిచ్చల్ విద్యుదుత్పత్తి కిం
దులకున్ యంత్రబలమ్ము దోడ్పడిన హిందూదేశ మప్రాచ్యభూ
ముల నోరెత్తఁగ నీయ దిట్టిప్రభవమ్మున్ గల్గి ఘోరక్షుధా
జ్వలన జ్వాలల కగ్గమైన దపహాస్య మ్మింక వే రున్నదా?

నలునాళ్లుండినఁ బిప్పిదక్కఁదటు పైనన్ హిందువుల్ ముస్లిముల్
కలఁతల్ దక్కదు రస్వతంత్రులకుఁ గక్షల్ మెంచు నిర్మాణకౌ
శలముల్ దక్కవ దీనఁ బూజ్యమగు రాజ్యమ్ముల్లకల్లోలమై
నిలువ న్నీ డయినన్ లభింప దటు లేనిన్ శాంతి దైవారునే?

నీ దేశం బిది నీజనం బిది యివే నీవేషభాషాదు లం
చాదేశించు మహాత్ములన్ బగడకన్నా! స్వార్థచింతారతుల్
చేదు న్మేతురు వారిపొత్తు విడుటే శ్రేయమ్ము న్యాయమ్మటుల్
కాదేనిన్ దమపాచిపీనుఁగులఁ గుక్కల్ ముట్ట వీజన్మకున్.

జలధుల్ దానజలప్రమాణములుగా షట్చక్రవర్తుల్ మహీ
వలయ మ్మేలిన గాథ లల్లి మురిపింపన్ జూచు కాలమ్ముగా
దలవా టట్టిది ప్రస్తుతస్థితి భవిష్యద్దాస్యబంధచ్యుతిన్
దలపించెన్ వెలలింపు మాధునిక సిద్ధాంతమ్ము లెప్పాటివో?

కులకక్షల్ పెరరేచి నేఁడు బలుసాకుందిన్న బయ్యన్నలై
కొలుకుల్ ద్రిప్పెద రందునిందుఁ దుదకాకుం బోకలం బొందరీ
ములుచల్ దేశ మరాజకమ్మయిన మమ్మున్ మిమ్ముఁగారింతురిం
దులకున్ బూర్వచరిత్ర సాక్షి మతవిద్రోహమ్ము లీనాఁటివా?

## మతము

మనమతసంప్రదాయములు మంచివి కా వనువారిగుండెలో
గునపము లాడుఁగాక కనుగుట్టి పరుల్ బెగనాడ నీవు నై
యని తలక్రిందు లైతివి సమస్త లోకప్పుడు మంచిచెడ్డలన్
గనుగొని దిద్దుకొందు రెటుఁగాక తపించు త్రిశంకు లుందురా?.

పరమామ్నాయశిఖారహస్యపదవీపారంగతుల్ బుద్ధశం
కర రామానుజ దేశికప్రభులు విజ్ఞానప్రదీపమ్ము ని
ల్పిరి తచ్ఛాయ లఖండభారతమునన్ వెల్గొంది ఖండాంతర
స్థిరకీర్తిన్ గడియించుకొన్నవఁటె ప్రాచీనార్యమర్యాదలన్!

లోకమ్మున్ నడిపించు విశ్వమత మాలోచింపు మొక్కండు లే
దే కాలమ్మును నిల్వఁగల్గిన మతమ్మే కానరా దున్నచో
నీకల్లోలము లీమతాంతరము లందీ వెర్రి వేదాంతముల్
రేకెత్తం గలవా? సుభిక్షముగ ధాత్రిన్ ధర్మ మట్టాడదా?.

పరులర్థార్జన కండదండగ మతవ్యాపారముల్ సల్పినీ
పురు గేరన్ గమకించి రీకరణి సంపూర్ణమ్ముగా మార్చినై
తురు నీదేశము నీమతమ్ము తుద కంతుం బంతు లేకుండ సం
కరమైపోదువు నాఁడెఱుంగుదు వుపేక్షాతత్త్వ మెప్పాటిదో?.

మతయుద్ధమ్ములపేర దివ్యతరసామ్రాజ్యమ్ము లెన్నెన్ని దు
ర్గతి పాలైనవో ? యెంద ఱెందఱు ప్రవక్తల్ తల్లక్రిందైరో ? నీ
మతి నూహింపుము జాతివైరము, మతోన్మాదమ్ము దుర్జాతి కా
చితి కెక్కించినఁ దీఱు శల్యగతముల్ చేసేత వారింతుమే ?.

మత మన్యోన్యనిబంధనమ్ములకు ధర్మవ్యాప్తికిన్ విప్లవ
చ్యుతి కాత్మోన్నతి కేరుపడ్డ దని విజ్ఞుల్ చాటినన్ దైవని
ర్మిత మంచున్ మడిగట్టుకొందు విఁక స్వామీ? మీనమేషమ్ములే
గతి నీజాతికి బైలుదేఱుము జగత్కల్యాణసంధాతవై.

తరణోపాయము కైన దెల్లెడల సత్యస్థాపక మ్మైన దం
డఱుకున్ జేరుగడైన దెల్లప్పుడు చైతన్యప్రదమ్మైన దే
స్థిరమైనట్టి మతమ్ము నల్వుర కుపాదేయమ్ము నీగుండె ని
బ్బర మేదీ! ముకుసూటిగా నడతువా? ప్రాజ్ఞుండ వీవన్నిటన్.

# దేవుఁడు

భగవదధీన మన్నపుడు పౌరుషమున్ దడవం బనేమి ? యి
య్యుగగమనప్రభావము నొకొక్కపుడైన స్మరింపకుందువా?
గగనము మోవఁగాఁ బ్రకృతిగర్భము చీల్చి విచిత్ర సృష్టికిన్
దెగఁబడి రింకనీవనిన దేవుని గీవుని సంస్మరింతురా ?

పవనతరంగమాలికలపై నడపింపరె? లోకవృత్తముల్
దివి భువినొక్కపెట్టున గదింపరె ? ఖేచరులైరి భూచరుల్
చివరకుఁ దత్త్వవేత్తలొక జీవరహస్యము దక్క సృష్టిలో
వివిధ దశాంతరమ్ములు వివేచన సేసిరి మూలముట్టుగన్.

శోధకు లాచరించు పరిశోధన విన్నకొలంది నీమనః
ప్రాథమికస్థితుల్ మఱచి భావిపరిస్థితి కుత్సహింతువీ
సాధన మీఁడఁబోక కొనసాగినచో విపరీతచేతనా
గాథలకేమివచ్చెఁ బొడఁగాంతువుమూలవిరాట్ స్వరూపమున్.

మానవబుద్ధి కందనిది మాత్ర మనాదిమ పాంచభౌతిక
స్థానమునందు లేదని విచార మొనర్చి రొకప్పు డున్న వై
జ్ఞానిక దృష్టిలోప మదిగా దిదియాననుయుక్తి వాదముల్
మానిపురాతనాద్యతనమార్గము లందు సమన్వయింపుమా!

నీ ముఖమానముద్ర గమనించితి స్థావరజంగ మోజ్జ్వల
శ్రీమహిమాఢ్యముల్ ప్రకృతిశిల్పరహస్యము లెట్లు త్వాదృశ
స్వాముల కంతుపట్టు నిటువంటి సమస్యల పొంతఁబోయినన్
మామది కింపొదందు రిది మాహృదయమ్ముల కెక్కె నీక్రియన్.

హోరని బోరు కొల్వెడు మహోదధిఁ గన్గొను వేళ మింటికిన్
బారలు సాఁచి పైకొనిన పర్వతపంక్తులఁ గాంచు చున్నెడన్
దారకహారమౌక్తికవితానవిరాజివియత్పదమ్ములై
పారసి నప్పు డీశ్వరమహత్వము గోచర మౌను పుణ్యుఁడా ?.

తొలకరి భూములన్ బరువుద్రోలు మొయిళ్లను గాడ్పు కౌఁగిటన్
నలఁగు బయళ్ల నాతపమునన్ జెమరించు పగళ్ల వెన్నెలన్
గులికెడు రేల నెల్లపుడు గుప్పికిఁ దెచ్చి కరంగి వింత వ్యా
ఖ్యల కగు చిత్త మీశ్వరునికై తపియించున దేమి చోద్యమో?.

పూవులకోవలన్ గరఁగి పోయి మరందములన్ స్రవించి లేఁ
దావులఁ దారి పుప్పొడి పదమ్ములఁ జేరి నిరంతరమ్ము మా
భావకవిత్వముల్ ప్రకృతి భాగ్య మమాంతము గ్రుమ్మరించినన్
దైవవిలాస మించుకయినన్ మనవారికి బోధపడ్డదా ?

ప్రతినిమిష మ్మజాండగృహపంక్తులఁ గోట్ల కొలంది జీవు ల
ద్భుతముగఁ బుట్టి చచ్చు నటపోలిక లగ్థముగాను జీవిత
స్థితిగతు లెత్తనేల ! చిఱుచీమకుఁ గన్నులు, కాళ్ళు, కండ లె
ట్లలితి కెనో? దానిలోన నెటు లాయు విమిడ్చెనో? శేలదింతకున్.

మీలను నీటఁ బక్షులను మింట మృగమ్ములఁగానఁ గప్పలన్
ఱాల నిసుంగులన్ జనుల నాఁటికి నేఁటికి సాకు భార మా
వేలుపుపెద్ద కెందులకో విశ్వగురువ్యవహారకాండలన్
గీలక మంతుపట్ట దది కేవలుఁడాతఁడె గుర్తెఱింగెదుర్

ముత్తెము స్వాతిచిన్కులకు మొల్కలు తొల్కరి కుమ్మదమ్ములున్
జిత్త కశాంతి గాడ్పున విచిత్రవివర్ణము లభ్రవీధి రే
కెత్తి నటించు చున్నవెవఁ డేర్పఱచెన్ వినిబంధనమ్ము లా
'పెత్తనదారి' సుంతకనిపింపఁడె కన్నుల కర్వు దీఱఁగన్.

తలక్రిందై తపమూరించి మన తాతల్ తండ్రు లానంద వీ
థుల నూరేగిన జాడలారయుట కుద్యోగింతు వధ్యాత్మబో
ధలఁ గావింతువు పౌరుషమ్మునినఁ బ్రస్తావింపవో వెఱ్ఱి బా
గులవాఁడా! బిడిదప్పిపోకు మిరువాఁగుల్ ముక్తిసోపానముల్.

## హంపీయాత్ర

అన్నా ! ఆంధ్రుఁడ వైన నేమిఫల మాహంపీమహాక్షేత్రమున్
గన్నావా ? పెనుగొండ లందుఁగొలువై కౌఁగిళ్ల లాలింపఁగా
మన్నావా ? రతనాలశిల్పమచటన్ మున్నైనగాథావళుల్
విన్నావా ? దురదృష్టవంతుఁడవు నీవే నాఁటికిన్ నేఁటికిన్.

తాతలనాఁటి గాథలను ద్రవ్వఁగ నాతరమౌనె హాక! రాట్
భ్రాతల ధర్మమాయని పురంబిట వెల్గెను కృష్ణరాయజా
మాతృనిపుణ్యమాయని సమస్తము నాశనమైన దింతకీ
పాతకహేతు వెవ్వరను ప్రశ్నకు నీశ్వరుఁడే భయంపడున్.

తెలుఁగుంగన్నడ మొక్కరేవుబడి వృద్ధిఁజెందె శ్రీకృష్ణరా
యలకాలమ్మున నాఁడిదేమి ? కథకావ్యంబయ్యె మార్గాలలన్
శిల చిత్తర్వయిపోయె లేఁజవురునున్ జేవయ్యె మా తెల్గుక
త్తులు కారాడిన కర్మభూమిపయి నెందున్ లోటు వాటిల్లునా?

త్వరగారమ్మదె నాగలాపురము చెంతన్ జేరి నా‡మాంధ్రజ
హ్వారిపుణ్యమ్మునఁ జూపుమేరనదె రాయల్ గేటు చూపట్టు నా
దరిఁ జూళాయినయున్న దిచ్చటన కాదా? రాజబంధుల్ దనుం
బరివేష్టింపఁ బధిశ్రమంబుడుగ భూపాలుండు కొల్వోటయున్.

---

‡ కల్లూరి చంద్రమౌళిగారు.

ఆలన దక్కిహంపి సరిహద్దుల ఖుద్దునఁగాచు పెద్ద గో
రీ లవె రెండు యాత్రికుల దృష్టికిదే మనిపించు ముస్లిముల్
లాలనచేసి యీనగర లక్ష్మివిలాసము చూఱలాడిపోఁ
జాలక నిల్చిపోయిన విశాంపతు లం దొక రిద్ద రుండిరా?

ఆగుట్టన్ మలిపించి రుగ్రనరసింహస్వామిగా సైనికుల్
లోఁగొన్నారఁట వీనివిక్రమకళా లోలాత్ములై వైరులన్
ఔగాకిల్లు భవిష్యదంధ్రజన శౌర్యజ్యోతి వెల్గించుచున్
ఈగడ్డన్ నివసించుకెంత వఱ కాయిల్లాలు లేకుండఁగన్.

కొండకుఁగొండ తొల్చి యొకగుజనొర న్నెలకొల్పి రాయెడన్
బండినకీర్తిచంద్రికలపైఁ బసఁడింపఁగను బాప మీయెడన్
మండినకోట దిబ్బలకు మధ్య సమానమయంచు రేవగల్
పిండము లేక యెందుకుఁ దపించునొ? కద్వల కల్గణేశుఁడున్.

అదె మాతంగము మాల్యవంతమటు ఋష్యమ్ముందు హేమకూటమ
య్యదె కిష్కింధ యిదేనఁటయ్య! ఘన విద్యారణ్యు లిచ్చోటనే
కద బ్రాహ్మ్యంబును క్షాత్రమున్ వెలుఁగ దీక్షన్ బూని నిర్మించినాఁ
డదియే మారటస్వర్గమై నెగడు విద్యాపట్టణ మ్మాంధ్రుఁడా!

కులగోత్రమ్ములు దెల్పి [illegible] కోదండరామయ్య కోఁ
తులతో ముచ్చటలాడి యిం[illegible] సంధుల్ తెస్సినో నేసెనన్
స్థలగాథల్ పచరించుచుం బ్రబలాధారమ్ము లౌ నీశిలా
తలముల్ శ్రీరఘురామచంద్రుని చరిత్రమ్మెంత కీర్తించెనో?

త్రివేణి

పంపాసరస్సులోపలి నీలికెరటాలు
సీతమ్మకష్టాలు సెప్పవయ్యో
శబరి వసించిన గొంబ రఘురామయ్య
తిన్న యెంగిలి పిండుఁ దెల్పదయ్యో
వాలిదూలిన మాల్యవంతమ్ము సుగ్రీవుఁ
డడలి యేడ్చిన జాడ నుడువదయ్యో
మాతంగముని తపోమహిమ లీనినతావు
ప్రాఁతగాథల బయల్పఱుపదయ్యో
దిగులు పుట్టించు నీలంజ దిబ్బమైన
దివ్యరామాయణమ్ము గీతింపదయ్యోఁ
గొదువలేకుండ వాల్మీకి కోకిలమ్ము
పాడిపో...న గుర్తు లిప్పటికిఁగలవు.

గుణభద్రా! యని తుంగభద్రనిటఁ బేర్కొన్నాఁడు తెన్నాలిరా
మన తక్కుంగలపెద్ద లేమనిరొ? పంపాభర్త లోఁగింటికిన్
వెనుకంజుట్టి మహాద్రులంగమిచి హంపీరక్షణార్థంబు త్రి
వ్వని పెన్కుందకమైనయీనది మహాత్వం బెంతకీర్తించెదన్.

ప్రాతస్సంధ్యల నష్టదిగ్గజములీ పాథస్తరంగంబులం
దీఁతల్గొట్టినఁ దుంగభద్ర కొడ లెంతేఁబొంగెనో? నాఁడునే
నే తత్ప్రాంతశిలోపవేదికను గానీ? లేతృణంబైనఁ గా
నీ తద్గర్భతరంగ పోతమను గానీ యైన ధన్యాత్ముఁడన్.

కొండలు కొమ్ములొడ్డి యివిగో? యివిగో? భవదీయశౌర్యమా
ర్తండుడు చన్నత్రోవ లని తాల్గఁగన్ విలపించి చూపిన
ట్లుండలు గాలి బీటలయి యాహవదోహల మా తురుష్కరా
ణ్మండలి కింటి గుట్టును సమూంతము సొంతము వట్టియిచ్చెనే?

ప్రకృతిపాఠము గఱచిన ప్రభువునాఁడె
బొంగరుకొండలె గంధర్వనగర మయ్యెఁ
దలఁచి పన్నీరు చిలుకుట ధర్మ మగునొ?
అరసి కన్నీరు కురియుట కర్మమగునొ?

ముత్యాలశాల సాహిత్యలక్ష్మి గశించు
విశ్వకావ్యజయమ్ము విఫలమయ్యె
రత్నాలచవికె స్వారాజ్యలక్ష్మి నటించు
రంగభూమికి శృంగభంగ మయ్యె
తీరైన శిలల శృంగార లక్ష్మి వహించు
శిల్పసౌందర్యమ్ము శిథిలమయ్యె
చండశాసనముల శౌర్యలక్ష్మి విధించు
శిక్షాస్వరూపమ్ము జీర్ణమయ్యె
కట్టుకథయైన దేచిన్నఘుమ్మన
గాలికబురైన దేముడ్ని సోగికైనఁ
ప్రత్యణువునందుఁ బ్రభుశక్తి ప్రజ్వలించి
కన్నచోటెల్ల గుండెలు గలఁచివైచు.

ఏనాఁడు పంచిరో యీ కోటశక్తుల
కరివీర కంఠ రక్తాసవమ్ము
ఏనాఁడు కూర్చెనో యీ శిలావేదుల
గుఱువెట్టి మన్నీల గుండెకాయ
ఏనాఁడు మ్రోసెనో యీతుంగభద్రపై
శత్రురాజుల ధనుశ్చాలనమ్ము
ఏనాఁడు నిల్పిరో యీరచ్చపట్టులో
శౌర్యముద్రలు సెక్కి జయపతాక
రాణు లేనాఁడు కాళ్లపారాణి విదిచి
నగరి వాఁకిటఁబస పంటి నాఁగాఁగాని
నేఁటికవి వ్రాఁతకోఁతల నిలిచిపోయెఁ
గాలగర్భములోపలఁ గలసిపోయె.

విలిచిరో యీరాజవీథిలో జాతిర
త్నాలు విదేశవర్తకులు గూడ
వలచిరో యీ వేశ్యవాటిలోఁజలువతా
పూలపీటలఁ గీలు బొమ్మ లరసి
పంచిరో మీఁదిబ్బపై దనరాకాన్క
లిరుగేలఁడంకాలు పొరలిపోవ
వ్రాసిరో యీ దివ్య భవనవేదికలపైఁ
గమ్మని కల్పనాకావ్యములను

మెచ్చిరో నాట్యరంగభూమికలమధ్య
గజ్జె గట్టిన జవరాలి కన్నుసన్న
వ్రేసిరో యీనగారాను విసువులేక
తిమ్మరుసు చావడికిఁదల దిమ్మపట్ట.

నీలి మబ్బులమధ్య నిల్చి యింద్రాయుధ
మ్మొక్కోట కొమ్ముల కెక్కియాడు
పొగమంచు తెరఁ జీల్చి తెగనీల్గు నీరెండ
పసిఁడికుండలచుట్టుఁ బ్రాఁకులాడు
ఎడ పెడఁబడునుక్కు పిడుగువానలు ఱాతి
చూఱులఁదొట్టి కన్నీరు విడుచు
చల్లని తెల్లని జాబిల్లి వెన్నెల
విద్యానగరవీథి వెల్లవేయు
ప్రకృతి దప్పనేఁడు పాలించువారేరి ?
కొండముచ్చుగుంపో ? కోఁతి గుంపో ?
విజయనగర రాజ్యవిభవ మిట్లౌనని
తలఁచినారె ? దేవతలును గూడ.

జలకేళిన్ సవరింపఁ ద్రవ్విరఁటగా స్నానాలకోనేరు రా
యల శుద్ధాంతము చేటికాపరివృతంబై మజ్జనంబాడు నం
దలి శృంగారవతుల్ సహాస్యముఖులై దాదప్వులం బాఱుచున్
జలయంత్రమ్ములఁ జిమ్ముచున్ గులికి యుండంబోలు నవ్వేళలన్

కొనలు దీర్చిన జాతి గుబ్బపై జల్తారు
పావడాకాంతులు ప్రజ్వలింప
చిగురువెట్టిన జాతిసీలపై వెలలేని
తారహారమ్ములు జీరుకాడ
కుదురుగాగట్టిన గువ్వగూళ్ల సుగంధ
వస్తువుల్ గుమ్మని పరిమళింప
దిద్దితీర్చిన చల్వతిన్నెలపైఁ గాళ్ల
పారాణిగుర్తులు పేరుకొనఁగ
అష్టకోణ జలాగారమందు నాఁడు
హేమవల్లిక లట్టిట్టు లీఁదెనెన్నొ ?
నందనవనాలు పుష్పించి నవ్వెనెన్నొ ?
రకరకమ్మగు మధురచంద్రికలు గురియ.

శిలనిద్రించిన గిల్లినారా? యులిచేఁజెక్కించినారో! మనో
బలమున్ గూరి యమర్చిరో? తెలియ దీపాషాణముల్ వెన్నము
ద్దలవోలెన్ గఱపించి కట్టినటు లర్థంబౌను నాసిద్ధహ
స్తులు లోకోత్తరులైన మానవులకున్ దుస్సాధమొండున్నదా?

రకమొక్కతీరుగా జాతిగుబ్బలతల్పు
లెట్టుత్రిప్పిచెక్కిరో యెఱుకపడదు
పనివాని నేర్పుట్టిపడు జాతిరథమెట్లు
తీర్చి దిద్దిరోగాని తెలియరాదు

సప్తస్వరము లీను స్తంభవితానమ్ము
లెట్లేర్పరించిరో యెఱుఁగరాదు
పెనుబండలెత్తి నిల్పిన చూఱు లేజాడఁ
గుదుటఁబెట్టిరొ కాని గురుతుపడదు
వింత నిర్మాణములు శిలావిష్కృతములు
భావిజనదుఃఖ విస్మయాపాదకములు
పార్థివంబులు నైజసంపదలు దక్కి
తైజసము లయినిల్చె నీతరుణమందు.

ఆంధ్రవైష్ణవుని శైవాభిమానముచాటు
శ్రీవిరూపాక్షుని దేవళమ్ము
ప్రాచీన శిల్పప్రభావ ముద్ఘాటించు
విఠ్ఠలాలయశిల్ప వేదులెల్ల
శిల్పిసుందరుని విచ్ఛిత్తి కల్పనగుత్త
గొను హాజారస్వామి కుడ్యపంక్తి
సీతాపహరణమ్ము సెప్పి కన్నీరోడ్చు
నచ్యుతాలయ గోపురాగ్రశిఖలు
ఏమహాశిల్పియాత్మ లయించిపోయి
ఇట్టి యపురూపమెత్తి జీర్ణించినదియొ ?
పాపమాతని నామ రూపమ్ములైన
బయలు పఱుపకపోయె దౌర్భాగ్యశిలలు.

దానతులదూఁగె నాంధ్రభూధవుఁడునాఁడు
దివ్యదీనారటంకాలఁ దీర్థమాడి
పావుకొనిరఁట పండితప్రభువు లపుడు
తృప్తి యను మాటెఱుంగని తృష్ణఁదోఁగి.

తుంగభద్రానదీ స్వాదుతోయములను
హేమకూటాద్రిపైకి రప్పించిరెట్లొ ?
ఆనదిన్ జీలివచ్చు కుల్యాంబువులకుఁ
బ్రతిపదమ్మునబంగారు పంటపండు.

ఈ మహావైభవములకు నెవఁడు హేతు
విన్ని దిగ్విజయములకు నెవఁడు మూల
మీకళాసంప దభివృద్ధి కెవఁడుకర్త
మంత్రి తిమ్మరు సనుమాట మరువకన్న !

రాయలు కొల్వైన రచ్చపట్టులు సూచి
గుండె నీరై గోడుగుడిచినాము
వల్లకాడగు రాణివాస శైథిల్యముల్
వీక్షించి కన్నీరు విడిచినాము
కూలిపోయిన గుడుల్ గోపురమ్ములుగాంచి
వెచ్చని యూర్పులు పుచ్చినాము
సహగమన ప్రదేశమ్ములు దిలకించి
సారె కాపాతవిధి దూఱినాము

ఆ నృపతు లామహాప్రజ లాకవీంద్రు-
లావిజయ చర్చ లేమైన వనుసమస్య
లరనిముసమైన నిలువ లే దాత్మలందు
మనము శాశ్వతమా యని మరలినాము.

ఎవఁడో "చప్పన్న" దేశాల కేలికంట
ఏడు "దక్కనముల" భూమి నేలెనంట
ఔను రారాజు గానోపు నతఁడు నితఁడు
తనువు చెడినను గీర్తియాతఁడె వహించె.

## శౌర్యజ్యోతి

చీలమండలదాఁక జీరాడనాజూకు
కరకంచు దోవతి గట్టినాఁడు
ముందు వెన్కాలదాఁక మోఁకాలిబంటిగాఁ
బొడువైన యరచట్ట దొడిగినాఁడు
కోలెమ్ముక్రిందుగా వ్రేలాడ ఱొమ్ముపై
బేసిగా వలెవాటు వేసినాఁడు
కోరచెంగులు చెక్కి కుడిచెవిలోనుగా
సొగసైన తలపాగ చుట్టినాఁడు
పట్టె వర్ధనములు దీర్చి పెట్టినాఁడు
పసిఁడి పొన్నులకఱ్ఱ చేఁబట్టినాఁడు
గొనబుపావలు కాళ్లఁగీల్కొల్పినాఁడు
పయనమైనాఁడు రఘుపతి ప్రాహ్ణమందు.

అతని కన్నులకెంజాయ లందునిలిచి
యూరునాఁ డేలుకొనునఁటే వీరరసము
అతఁడు వచియించు ప్రతివాక్యమందునిమిడి
మచ్చరించు నఁటే స్వాభిమానధనము.

జిలుఁగుం బచ్చల పైఁడి పోఁగులను గుస్తీపట్టు పుస్తీల లో
పలి సింగారముగన్న పేడికిని బుం స్త్వం బుప్పతిల్లంగఁదత్
స్థలసంకోచ మొకింత గైకొనక రాజద్వార ప్రాకార మం
జులఘుంటానినదమ్ము విన్న దెసకుం జొత్తెంచినాఁ డచ్చటన్.

బంగరుటాలపట్టములు పట్టిన వారొక్కచోఁ ద్రిభంగిమై
శృంగము లూఁదునట్టివి పసింజికరాటము లూనునట్టివై
ప్రాంగణశిల్పముల్ కనుఁబండువు సేయ నభంగసంగతిన్
బొంగుచు నల్లనల్లఁగొలువున్ పతియున్ నెఱవాడిచూడ్కులన్.

దిగ్గుమని కొల్వువెన్కకుఁ దిరిగిచూచె
నతని క్రీఁగంట నెత్తుడా లవఘళించె
నధిపతిముఖమ్ము వెన్నెల లారఁబోసె
నచటి సర్దార్లకిం తయ్యె నాననములు

తనకు నర్ధాసనం బిచ్చి మనుపువాఁడు
చివరకుం గనుసన్నఁ జేయఁగానికి
రఘుపతి శిరమ్ము పంకించె రాజుప్రమోల
గుప్పుమని వేడిరక్తము గుబ్బతిలఁగ.

కొలువుచేతులొడ్డి తలక్రిందుసేయునో
మిన్ను మన్ను కలిపి మొనపునేమొ?
మూఁపు లెగయఁదట్టి ముంజేసులోరగాఁ
బిడిచి బీఱనరము లిడియనూర్చి

కటకటంబడి పులిచార గద్దెపొంత
నడుగు మోవంగ నిల్చి యొయ్యారమొలుక
నోరగంట మహారాజగౌరవమ్ము
నాతృణమ్మున దిగఁద్రావు నట్లువాలిచె.

అటుకున్ దెచ్చిన పైడిపళ్లెమున వెయ్యాఱుల్ సమర్పింపఁగా
భటుఁ డాగద్దియ డాయ హేళనగ భూపాలుండు వల్కెన్ భవ
త్పటు శౌర్యమ్మున కుంకువైన దిది నిందాభాజనం బ్మెత్రి కొ
ల్చుట మీవంటి మహాభిమానులకు నిచ్చో మేటి వాటించునే?

కడగంటిలోఁగెంపు గదిరినచోనెల్ల
ముంగాళు తొడల మోపినావు
పళ్లెత్తి మున్నాడి పలికినచోనెల్ల
దళవాయి రక్తమ్ముఁ ద్రాగినావు
ముంజేతులం దీట మొలతెంచినపుడెల్లఁ
నూచకోఁతకుఁ బందె మొడ్డినావు
మునిపంటరాపిడి జనియించినపుడెల్లఁ
గాండ్రించినిప్పుకల్ గ్రక్కినావు
ఎదురుకత్తి లేక చదరంగమాడితి
వింతవఱకు సైఁచు టెఱుక లేదె?
రాచఠీవి నెఱపు రఘుపతినాయఁడి
ట్లనదకూడుగుడుచునా మఱేమి?.

అన్నతోడహృదయ మగ్నినిభంబయి
ఎఱ్ఱసెరల మిఱ్ఱిమిఱ్ఱిచూచి
భటుఁడువట్టినట్టి పళ్లెర మరకాల
నేడు వెరిగి నట్టులెగయఁ దన్నె.

అప్పటికే చెమర్చెఁగొలు వాఘటనమ్మున రక్తదీధితుల్
తెప్పలుదేలె సభ్యులకు దిమ్మని నిల్వనఁ బోటుపుట్టె రా
జప్పటి కప్పుడే వెడల నాజ్ఞయొసంగెఁ దదాజ్ఞ కుగ్రుఁడై
నిప్పులుగ్రక్కి పల్కె ధరణీపతి కొల్వుకటం జలింపఁగన్.

మల్లపరాజవంశమున మచ్చుజనించిననాఁడు సింగపుం
బిల్ల తృణమ్ముమేయు నొకవీరున కింతవృథాప్రయాసమున్
జెల్లునె? గుండెచీల్చి యరచేనిడి కొల్చినవారి నింతగా
నుల్లసమాడనేమి? చెడు గున్నతిసూచి సహింపనేర్చునే?

కొంపకు నిప్పువెట్టుకొని కూర్చితి నన్వయమెల్ల నేఁటికే
దింపుడుగళ్లమాస తలఁద్రిప్పఁగఁ జిచ్చుబుకం దలంచితో?
పెంపుడు బిడ్డనై మెలఁగి పిన్నలఁబెద్దల నొక్కరెక్కపై
దింపితి నట్లకాఁ దలఁచితిన్ గలకాలముకొల్వు సేయఁగన్.

ఇంతకు జారనీక కొలువిచ్చి రెటేనియుఁబెద్దసేసి సా
మంతములాడి రింతటి యమానుషకృత్యము లాచరించు ధీ
మంతులుగాకపోయిరి సుమా? మనతాతలు తండ్రులైన నా
కింతటి గౌరవమ్ము లభియించినదానికి సంతసించితిన్.

## త్రివేణి

కన్నీటిధారతోఁ గలిసిపోయినఁగాని
యుడుకాఱదోయి! నీ యుక్కుగుండె
గరువంపుచూపులో మెఱసిపోయినఁగాని
కళదప్పదోయి! నీకంటినీరు
నిట్టూర్పుసెగలోన నివ్వటిల్లినఁగాని
కసుగందదోయి! నీగర్వరేఖ
మూఁగసమాధిలో మునిఁగి పోయినఁగాని
చింతిల్లదోయి! నీ యంతరాత్మ
పచ్చినెత్తురు వాచేరఁబట్టి త్రావి
కోటకొమ్మున గిరవాటుగొట్టినప్పు
డౌడుగఱచి కనుల్విచ్చి యాత్మమఱచి
నిల్వునన్నిఱుగాకుండ నిల్తువేమొ ?.

తరతరమ్ములవారి పెత్తనము ఢలఁగి
బ్రహ్మరథ మింకొకరి కెట్లు పట్టఁగలరు
పూజ్యపూజన మెఱుఁగని పుటుకపుట్టి
గద్దెనెక్కనఁ గల్గునే గౌరవమ్ము.

సంప్రదాయానుగుణముగా సత్కరించి
పసిఁడిహారతి మనవారెపట్టినార
లింతమగసిరి గలవారి యేలుబడికి
దొడ్డరాజవు నేఁటికి దొరకినావు.

"రంగ పెత్తన" మొనరింత్రు రాచవారు
మడమద్రిప్పక నడపింత్రు మన్నెదొరలు
విశ్వముఱ్ఱూఁత లూఁగింత్రు వెలమవీరు
లడుగనా ! మీమహాప్రాభవాభ్యుదయము.

అడిగికొల్చు వార లర్థోపజీవులు
మాటపడనివారు మానధనులు
చేతనైనఁగొల్వ చేయింపవలెఁగాని
అనదవోలె నెగ్గులాడఁజన్నె.

అనుటతోడన విద్యుదుదారరేఖ
స్వాంతమున నింతలింతలై జాలువాఱి
పూచిపట్టిన వడువున భూధవుండు
జీవమయమగు నుబ్బెత్తు చిత్రమయ్యె.

చెమ్మటముత్యాలు చెఱగిపోసినమాడ్కి
నిలువెల్లజడిపట్టి వెలుకఁభాఱె
అద్భుతావేశమ్ము లాక్రమించిన లీల
నొడలెల్ల కంపించి ముడుఁగఁబాఱె
క్రోధమొక్కుమ్మడిఁ గ్రుమ్మరించినరీతిఁ
గడగంటిలోనగ్ని కణములురలె
అభిమాన ధనమెల్ల నాహరించినభాతిఁ
చిత్తమ్మురిత్తకు రిత్తయయ్యె.

పుడమి తిరుగఁబడ్డ వడువునవిభ్రాంతి
తోడరి నాయఁడొడలు గిడలుమఱచి
కొలువు గెలువు నెట్టికొలుకుల నెరియించి
తోడుతో వచింపఁ దొడఁగెనిట్లు.

పచ్చలగద్దెపైఁ జిలుఁగుపానుపుఁబట్టుల గోరిమిట్టలన్
బచ్చనిగడ్డి మొల్చి తెగఁబండు దినమ్ములుదాపురించె మీ
రచ్చల, రంగభూములను, రమ్యవనాంతరసీమలన్నిటన్
గచ్చలు, పుచ్చలుప్పతిలఁగా వఱదుల్ చెరలాడ వేన్నృపా?

దొంగలకు నీళ్లుదొరిపెడు దొరతనమ్ము
చెల్లిరా దిఁకఁ గాపట్యమెల్లఁదెలిసె
నీ మహాదానఫలమున కేమిగాని
గుండె లరచేత నిడి మఱి కూర్కుమింక.

ఎల్లి నాఖడ్గదేవత కెదురునడిచి
ప్రతిపదమ్మున రక్తకుంభమ్ము వోసి
శాంతి స్థాపింపు మింక రాజాత్మదీయ
రాజ్యవిశ్వాసి జనమనోరంజనముగ.

ప్రక్కబాసలమప్పుడు బానిసీంద్ర
వీఁపువ్రయ్యలుగాఁజెక్కి విడుచువాఁడఁ
బ్రదికి రతనాలమేడలఁ బవ్వళింతొ?
చచ్చి స్వారాజ్యసీమల సంచరింతొ?

అని జౌజవ్వనిభూమి గ్రక్కదలి నాట్యంబాడఁ బాదాగ్ర ఘ
ట్టనగావించి సలీల నేగుమదశుండాలమ్ము చండమ్మనన్
జను వీరాగ్రణిఁగాంచి భీతిగదిరెన్ స్థంభీభవించెన్ జెమ
ర్చెను గంపించె ధ్వనించె గొల్వకాసినాక్షేపించి రాత్మీయులున్.

తన కెంత యభిమానధనమున్న నేమాయె
మొగమోడ కింతఁగా దెగడినాఁడు
తన కెంత నెఱబంటు తనమున్న నేమాయెఁ
గొంచక బాహాప్పళించినాఁడు
తన కెంతయాభిజాత్యమ్మున్న నేమాయెఁ
బరువింత దెలియక పదరినాఁడు
తన కెంత రాచపెత్తనమున్న నేమాయెఁ
దారతమ్యము దక్కఁ దూరినాఁడు
ఘనకమునకు మేలికన కాసనంబిచ్చి
గఱువలైన బుద్ధిగఱపఁగలరె ?
చేతవాతఁగాని కోఁతికిఁ డెంకాయ
దొరకినంతమాత్ర నఱపికొనునె ?

బ్రహ్మాండ మరచేత బంతివాటునఁ ద్రిప్పి
బయలూడ విసరకే పయనమయ్యె
సభమొత్త మిరుగేలఁ జాపవాటుగఁ జుట్టి
పారలింప కూరకే తరలిపోయె

పసవట్టినెత్తుటి వట్టుదేలింపకే
వెడబొమలాడించి వెడలిపోయె
పతిగద్దె సందిటఁబనవాటుగాఁబట్టి
విసరకేదవ్వుల విరిగిపోయె
చెల్లరే ? రాజునెంత బజీతుసేసె
నాయఁ డిస్సీయఁటంచుఁ బరాయు లనిరి
అనఁప గుగ్గిళ్లు గానివి యప్పళింప
నినుఁప గుగ్గిళ్ళులని కొందఱెగసిపడిరి.

భూధవుండు వానిపోబడిఁదిలకించి
నిప్పుగాడ్పు లుఱక నిశ్వసించి
ఇతని శిరముద్రెవ్వ నేసి తెచ్చినవాని
కేను గొర్లమాన్య మిత్తుననుచు

ఇంచుకపస్తాయించి వ
చించెన్ మీరెల్ల నావచించినమాడ్కిన్
ద్రుంచెద రిదినాపగ యణఁ
గించున ? హింసారతుండు కీడ్పడకున్నే !

మధువుచిందిపోక మార్దవమ్ముడివోక
సౌరుచిలుకు సన్నజాజిపూవు
చేతులార మెదపి చీకాకొనర్పఁగా
సమ్మతింతురా ! రసజ్ఞజనులు.

తానొకసాటి వాఁడనికదా? బహుమానమొనర్చి గౌరవ
స్థానమొసంగినార మది తాను గ్రహింపక లేనిపోని క
య్యానకుఁగాలుద్రవ్వి తన ప్రాణములొడ్డుట కుగ్గపట్టినాఁ
డీ నరరూపరాక్షసుఁడిఁ కేమనవచ్చు విచారదూరులన్.

అయిన నిందుకొలువునం దేరిగైకొన
కాగ్రహమున నెగ్గులాడఁగాన
నేడుగడియలేని నెత్తినియెండలో
బండకొయ్య వ్రేయఁబట్టి తెండు

అనిన నాబళదేవు బాహాప్పళించి
దేవరకుఁజెప్పఁదగినట్టి తీర్పుగాదు
ప్రప్రథమశిక్షయే కొంచెపఱిచినారు
చిత్రవధకన్న వేఱొండుశిక్షతగునె?

ముందుసకుటుంబముగవాని ముట్టడించి
బందిసేయుఁడు కాలయాపనమువలదు
సమయముందప్పెనా? మరుక్షణమునందుఁ
గాలపాశమునకుఁగూడఁ గట్టుపడఁడు.

పలువురి గుండెకువ్రేఁగై
నిలువున రక్తమ్ముచింద నిందించినచోఁ
దలలేని బ్రహ్మసృష్టిన్
బులుదిని మతిలేక తిరుగుపుంగవ మనరే?

సెలవిడి పంపవె రాజా !
తలనరములు పెఱికి తెత్తు దర్పోద్ధతి మైఁ
బిలిచి కలుపోవ లేపిన
పులితోఁ గాట్లాడి సురిగిపోవం దగునా ?

అనెడుదళవాయి మాటకుయ్యాలలూఁగి
అవునుగాదననోడి రా జనుమతించె
రాగరంజితమైన నీరాజనమ్ము
నందుకొనఁబోలు నృపతిధర్మాసనంబు.

కొన్నినాళ్ల కచటి కోటకొమ్మనయందు
నాబళేంద్రుశిర ముయ్యాలలూఁగె
నధిపుమృతశరీర మాద్వారమునుండి
నాఁటిసంజ పితృవణమ్ము సేరె.

రాచనగళులం దిరమ్మదమ్ములు రెండు
రేయివగలు గోచరించెనఁట
‡కౌరయనిధ్యానించు నం[illegible]
కోటలోన వల్లకాటిలోన.

‡ ఔబళదేవు, రఘుపతి.

## మహర్షీ !

ఏమని ఖడ్గ మూని వధియించినవాఁడో? రఘూద్వహుండు తత్
స్వామిక మేమిగోరితివో ? చానను బట్టివధింపనేరవో ?
కామక మాటువెట్టి రిపుకంఠవిలుంఠన మాచరింపవో ?
ఏమిటికో... ? పిచ్చితప మిట్లొనరించి నశించితే కృతీ !

దండకలోవసించుతటి దగ్గటి కష్టసుఖాలుసెప్పి బ్ర
హ్మాండముసేసి ద్రావిడమహాన్వయ మెల్ల నశింపఁజేయ కు
ద్దండతపం బొనర్చి పెడదారులువట్టిన మందబుద్ధి కిం
కొండొకశిక్షయే ? రఘుకులోత్తముఁ డింతగ్రహింపకుండునే ?

తప మొనరింపఁ బాపములు దగ్ధములందురి దేమి కర్మమో
తపసిదొరా ! నశించితివి ధర్మపథమ్మిదిగాఁదలంచి యే
కృపణుఁ డొనర్చె నిట్ల తని కృత్యమువమ్మయిపోకనిల్చునా ?
అపకృతికాయు వెక్కుడనియందురు పాపము పండకుండునే ?

పాలనకేళిలోలమగు పావనఖడ్గము నీదురక్తమున్
గ్రోలఁదలంచెఁగాని తనుఁగూర్చి జగజ్జన మెల్ల ముక్కుపై
వ్రేలిడికొంటెఱుంగదు పవిత్రతమంబగు రామరాజ్యమీ
హేళనపాలుగావలసె నెవ్వరుకర్తలు హర్త లిందుకున్.

ఎంతవిచిత్రమిద్ది నృపుఁడెట్టువిచార మొనర్ప లేదు పు
త్రింతలుగాక నీవొకకడిందితపమ్మొనరింపఁ బాలుఁడీ
వంతునసీల్గుటేమి ? వినువారలుమెత్తురె ? పృష్ఠతాడనాత్
దంతవిభగ్నమన్నక్రియ ధర్మవిరుద్ధముగాదె పుణ్యుఁడా !.

పరమొ?గిరమ్మొ?యూహలెగఁబ్రాఁకనిచోటునవ్రాలిగింగరాల్
దిరిగి నశించితే నిను వధించిన హస్తము రక్తవర్షముల్
గురిసినదోయి ! ద్రావిడులగుండె పెకల్చి సజీవరేణువుల్
చెరగినదానిగర్భమునఁ జండదె ? రావణరాజధానియున్.

అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుఁడని
సాష్టాంగ పడి కేలు సాచినావె
శ్రీపాద పద్మాభిషేచనార్థమ్మయి
జీవనాశ్రువులు వర్షించినావె
ప్రభుభక్తి కిది నిదర్శన మదృష్టమ్మని
దేహాచ్యుతికి సమ్మతించినావె
అన్యదురాసద మ్మార్య ధర్మ మ్మని
జీవితమ్మునఁ బ్రదర్శించినావె
ఎంత లెస్సవాఁడ వినకులాగ్రణిచేతఁ
జెడనికీర్తి తనువువడసినాఁడ
వతని కీక తాన నప్రతిష్ఠఘటిల్లె
దీనసుకృతులెవరో ? తెలుపవోయి !

మహారాజ!

నీవొక దివ్యమానవ మనీషివె యీచతురబ్ధిమేఖలా
భూవలయమ్ము సాక్షిగఁ బ్రభూ! నిజమౌదుము దైవచింతచే
జీవిత మావులించినది చిత్తసమాధి ఘనీభవించె నీ
కేవిధిఁ జేతులాడెను కదే? వధియించితివిట్టి తాపసున్.

ఎంతవిషాదగాథ రచియించిన దన్న! భవత్కరాసి ని
న్నింతకు నెట్టిధాత సృజియించెనొ? వజ్రము వోనికర్కశ
స్వాంతునిగాఁ బరాత్పరుఁడు, సత్యము, పుణ్యము, పాప మున్నచో
బంతులు దిద్దిచెప్పెదను పాపము దక్కమఱొండుగల్గునే?

మీరఘువంశకీర్తి కుపమింపఁగఁజాలు పదార్థ మున్నదా?
ఆరయమీకునై పసిఁడి హారతిఁబట్టని వారలుండిరా?
పేరున కేమొగాక నరపీడయొనర్చినరోజు లున్నవా?
క్రూర కరాసితో మునులఁగూల్చిన భూపతులున్నవారలా!

స్థావరజంగమప్రకృతిసాక్షిగఁ బూర్ణకఠోరగర్భ నా
పావనగాంగ భూములకుఁబలపితి వింతటిక్రూరకర్మమే
దేవుఁడొనర్చెనోయి? నినదించి యజాండములున్ జెమర్చెరా?
కేవలమానవోత్తముల కృత్యములా! యవిరామభూవరా!

ఎన్నఁడు జానకమ్మ విలపించెనొ ? ఘోరవనాంతరాశ్రమా
భ్యున్నత భూములందు నటనున్న శిలల్ ద్రవియించి యేడ్చెరా !
నిన్ను శపింపకున్న యవనీజము లేదది చాల కీర్తియన్
బున్నముగట్టికొంటివి ప్రభుత్వమొనర్చిన మూఁడునాళ్ల కే.

ధర గ్రొచ్చి సప్తసాగరములు నెలకొల్పి
సగరుండు తనదీక్ష చాటినాఁడు
విశ్వవిశ్రుతపుణ్య విజయమ్ము సాధించి
మాంధాత రిపుకోటి మరపినాఁడు
రేవగల్ భూతధాత్రిని దాయఁగట్టించి
పృథువు దివ్యౌషధుల్ పిదికినాఁడు
ఉర్వీతలము సొంత ముట్టూఁత లూఁగించి
రఘురాజు రవ్వలు రాల్చినాఁడు
వారికీర్తి పతాక కీవాయుపథము
వలగొనుచునున్న దీనాఁటి వఱకుఁ గూడఁ
బుణ్యపాపమ్ములూరకే పోవునయ్య !
కట్టికుడుపక విడుచునా ? కర్మఫలము.

నిన్ననరాదు నీవు మహనీయుఁడవే నినుఁ బైకిఁ దీసి మా
కన్నులుగప్పి యిట్టికథకల్పనచేసిన వారినన్నమా
పిన్నలఁ బెద్దలన్ బయటఁబెట్టెద రాత్మకృతైకదోషమం
చెన్నరు మానమేమత మనేకులపోకడ లేకమైనచో.

# ఉపాయ

**కవిరాజు!**

ఓకవిరాజ! నీకృతుల కున్న విశిష్టత యాంధ్రలోకమం
దేకృతి కుండఁబోదు భవదీయకవిత్వమహత్వనైపుణం
బేకవి కందఁబోదు కవులెందఱొ వ్రాసిరి వ్రాయుచుండి రా
పోకడ లార్యవాఙ్మయప్రభుత్వపతాకములన్ గదల్చెనా?.

నీ కవితామహాంబునిధి నిర్భరభావతరంగ మాలికా
వ్యాకుల మాంధ్రలోక మొకొకప్పు డెదుర్కొనలేక నిన్ను నీ
పోకడలన్ శపించి వలపోసిన దైనను సవ్యసాచివై
వాకొక బాకుఁగా విసరివైచి తపస్సృతు లంతరింపఁగన్.

నీరచనాభిఘాతముల నేఁటి కపాట పురాణగోపుర
ద్వారకవాటపంక్తులు బదాబదలైనవి, యింత కీ వసా
ధారణభావవిప్లవ విధాతవు గైకొనవన్న! దివ్య క
ర్పూర సుగంధవస్తు పరిపూర్ణసువర్ణజలాభిషేకమున్.

గంగోత్తుంగ తరంగ రింగణసదృక్షం బైన నీశైలితో
లుంగీగట్టిన కావ్యకన్యకలు వేలున్ లక్ష లున్నారు నీ
బంగారంపుఁ గవిత్వవస్తువులతోఁ బైపోటి కిఁక నిల్చి మా
పింగాణీసర కమ్ముకొన్న యెడఁ గాఫీనీళ్లకుంగిట్టునా?

ఎవ్వరేమన్న నీకత్తి కెదురులేదు
బ్రహ్మచెవు లూడఁబొడిచెదు పండితుఁడవు
చండశాసనకవి తాపిచండిలుఁడవు
కాని నీహృదయము వెన్నకన్న మృదువు.

చాళుక్యమన్మథు సమకాలికుఁడవైనఁ
బలుకదా? నీచేత భారతంబు
మన్మసిద్ధికి ముద్దుమామవై నెగడిన
నసలురామాయణ మ్మందుకోనఁడె?,
ప్రౌఢరాయల సభాభవన మందడుగిడ్డ
రచియింపఁడా? నీకు రత్నశాల?
ఆంధ్రభోజున కిట్టియవకాశమబ్బినఁ
బంపఁడా? ముప్పాట భద్రగజము?
అందఱకుఁ దుట్టతుది వాఁడవైనకతనఁ
గాలదౌర్భాగ్య మీాక్రియఁగ్రాలుకతన
నాంధ్రులకు నుద్గమనశక్తు లడఁగుకతన
బాట దప్పినదోయి! నీబ్రహ్మరథము.

అమ్మహానీయు లాకవుల కప్పు డొనర్చిన గౌరవమ్ము లే
శమ్మిపుడున్నదా? కవితసంగతి దేవుఁడెఱుంగు నైన నీ
కమ్మని కైత మాహృదయ కౌముదిరా! కవిరాజ! తెల్గుదే
శమ్మునఁ బుట్టుకున్నయెడ సత్కృతు లిట్టి వఁటన్నలెక్కయా?

ఉన్నది యన్నయట్టు లను
చున్నెడ లోకము తల్లకిందు లౌ
చున్నను జంక వాకలము
కున్న స్వతంత్రత యాస్వభావమం
దున్న వినిశ్చయం బెవరి
కున్నది! హెచ్చులకేమి? నీవలెన్
అన్నిటఁ బోటికై బ్రదికి
నప్పటి మాటకదా, మహాకవీ!

రాముఁడా పురాణికి న్నికు రావణుఁడా!
సంజయుండా ఋషికి నీకు గింజయుండే!
ఆది కవిసింహములకైన రేఁదినావు
ఖ్యాతి గుండియరా? కవిరాజ! నీది

మంతు కెక్కిన సూతాశ్రమమున యందుఁ
బ్రాహ్మ్యపస్పంధ్యలన్ చెల్లు పైఁడి పీఁగ
పలుకు చున్నది నీయంకతలము నెనసి
ఉడుకు జాతీయభావమ్ము లుప్పతిల్ల.

అమ్మధుర గానమున కఖిలాంధ్రదిశలు
పులకరించి రసాశ్రయభూములయ్యెఁ
గుదురుకొనెనందుఁ బీయూషప్రవాదములెన్నొ?
రాకతీరునె? యచటికి రసికజనుఁడు.

## త్రివేణి

ఈ గుడివాడ భద్రగజ
మెక్కి సరాసరి వాడవాడ లూ
రేగునెడన్ సుధీంద్రులు, క
వీంద్రులు తోఁజను దేర నాఁడు స
ర్వాగమవేత్త, ప్రౌఢకవి
తాంబుధి శ్రీకవిసార్వభౌముఁ డా
రేగిన కొండవీటి జన
దృశ్యము లిప్పుడు గోచరించెడున్.

నూతపురాణము భగవ
ద్గీతయు మొదలైన దివ్యకృతు లిమ్యాంధ్ర
క్ష్మాతలమున జేగంటల
ప్రోఁతల నింటింట మాఱుమ్రోఁగు ను నీవై.

# సంస్కృతి

నవరసమ్ము లొలుకు కవిరాజ చరితమ్ము
కంటినీట వ్రాయఁగడఁగినాఁడ
షష్టి పూర్తికైన సత్కావ్య మొకఁ డిచ్చి
తన ఋణమ్ము నీఁగఁ దలఁచుకొంటి.

యోగి పుంగవుండు మాగురు దేవుండు
యముని గిముని గాలఁ జమరినైచి
తాఱు మాఱు లేక నూఁటేండ్ల పాటైన
బ్రతికి తీఱునన్న భ్రాంతికద్దు.

చిన్ననాఁ డదేమొ ? సిగ మొగఁగట్టిన
దాది జుట్టు మంచుఁ జేఁదినట్లు
కన్న విన్నవారు కడ కన్నవారును
కలికమునకు నేనిఁ గానఁబడరు.

ఉక్కుపంజరమ్ము లూపిరితిత్తులు
పొగల సెగల నుడికి పోవుచుండ
వజ్రదేహ మాంధ్రవాఙ్మయ సేవకై
ధారవోసి మనకు దారిసూపె.

వరుసదప్పినఁ గొండంత వాఁడఁ టంచుఁ
బరువు లెత్తితి మాపదల్ వాపికొంటి
మాతఁ డెవఁడైన దాసోఽహ మన్నఁజాలు
గుండె లఱచేతనిడి కడుగూర్చినాఁడు.

తప్పునైనఁ దొప్పు తలఁదాల్చితీరును
వీలు దప్పునేని శూలినైనఁ
జేదు మేపి కడకు శృంగభంగ మొనర్చి
చక్క చెవులువోడిచి సాగనంపు.

ధర్మవృద్ధు లన్న దరిఁజేర్చు కొనువేళ
జాతిమత వివక్ష చాయఁబోఁడు
ఆర్యకవి కుతంత్ర మడుగంట నలెనను
పట్టుదలకె నడుము గట్టినాఁడు.

పట్టు పట్టినాఁడొ ? బ్రహ్మాండ మొరగినఁ
దలపొలాన నిలువ వలెఁజుమండి !
ఒక్కవ్యక్తి లోక మూఁకొట్టని సమస్య
కిన్నికాళ్లు దెచ్చు టెట్లు చెపుడ !

వేషభాషలందు విపరీత మొల్లఁడు
పారతంత్ర్యమునకుఁ బాలుపడఁడు
వలయు నేనిఁ గొండపైఁగోఁతి దిగివచ్చు
తరుణములనె కాలఁ దన్నినాఁడు.

సంఘసేవనమ్ము సాహిత్యజీవన
మార్గి జీవితమున కైనవందు
రిద్ధసంఘచరిత మైత్రోవద్రోక్కక
నిలిచిపోయె నెట్లు వెలయఁ గలదో ?

ఎన్ని జన్మలెత్తి యీసిద్ధహస్తుని
కవితలోనఁ జేయి గలుపఁగలము
తెలుఁగుకవుల మంచుఁ బెగరుంజుకొను వార
లితని పదము లాశ్రయింప కగునె ?

ఒకట నన్నపార్యుఁ డొకచోటఁ దిక్కన్న
ఒకెడఁ బెద్దనార్యుఁ డొకట భట్టు
కాని పింతురితని కావ్యదర్పణమున
నయనవస్తుభేద మగ్గలంబు.

గొంతు గూరుచున్న గోష్ఠంటి పెట్టుగా
నొవ్వఁబలికి యెదురి నోరు గట్టు
రచనలోని హాస్యరస మాకరణిగాక
స్నాయువులఁ దెమల్చి గాయపఱుచు.

ద్రావిడేయు లితని తల కెత్తగాలేదు
ఔత్తరాహు లితని నణపలేదు
వేదమతము పేర విశ్వమ్ము ద్రోఁచెడి
చెట్టవలవ దంచుఁ జెప్పినాఁడు.

పలువురాదరించు ప్రచ్ఛన్నబౌద్ధమ్ము
కోఱ లూడ్చి తూరుపాఱఁ బట్టి
నెగురవేయుబంతు లెటు దూలునోయంచు
వేదజడులు గోల వెట్టినారు.

పైకి నుడుకుచున్న భావమ్ములోనైన
మనదె తప్పఁటంచు మఱుఁగుచుందు
రింతమార్పు దేర నెదురీఁది నాఁడయా ?
ఆతి గుండె లొడ్డి రామసామి.

ముప్ప దేండ్ల సేవ కిప్పుడు గుర్తించి
ప్రజలు బ్రహ్మరథము పట్టినారు
కాని విశ్వగురుఁడు కన్నుమూయకమున్నె
మేలు కొనిరి కొంత మేలదైన.

అతనిగ్రంథ జాల మడుగువెట్టినచోట
మిత్రు లెంతవారు శత్రులైరి
కన్ను దెఱచు కొలఁదిఁ గాలక్రమంబున
భేదముడిగి కాళ్ల బేరమయ్యె.

ఉన్ననాఁడు లోక ముత్సాహపఱుపదు
చన్ననాఁడు బార సాచుఁగాని
కడుపుగాల కున్నఁ గవిరాజులగుదురా !
బాధ లేని తిరుగు బాటుగలదె ?

ఇంట "గరుడ" కాసు కేని దార్ఢ్యము లేదు
'ఒంట' మాత్ర ముసురు లున్న వైనఁ
బరుల నడిగినట్టి పాపానఁబోవఁడే
పణతపడ్డ దనుక తృణమొ? పణమొ ?

పరుల మెప్పుఁగోరి పాటుఁబడ్డది లేదు
స్వార్థమునకుఁ గేలు సాప లేదు
గొప్పతనము సూచి కోడ[illegible] కూసిన
జగము మాత్ర మింత సాక్ష్యమిచ్చు

తనకలమ్ము సంఘ తారకమ్మైనది
సంఘమునకు సుంత జాలి లేదు
తన్నుఁజూడ దంచు మిన్నకున్నది లేదు
ఉన్న బ్రదికి చచ్చి యుండు నెపుడో ?

ఒకరుఁ డింత క్రొత్త యుద్యమ మ్మొసఁగొల్ప
ద్రష్ట యంచువానిఁ దవులుచుందు
రితని నూత్నసృష్టి కేస్థాన మిత్తురో
ఇంత దనుక నిశ్చయించినారె ?

ప్రతిపదమ్ము సూత్ర ప్రాయమై విలసిల్లి
తరతరమ్ములకును దవిలివచ్చుఁ
గపట ధర్మకంచుకమ్ములోక మెట్లు
హృదయ మిచ్చి బ్రహ్మరథముపట్టు.

పరులు బైటబైటఁ బాషండుఁడనుకొన్న
మ్రుగ్గు మీఁది కేరు మ్రొగ్గ లేదు
పైకి రామసామి పాషండుఁ డగుఁగాక
అంతరాత్మ మాత్ర మాస్తికంబు.

ఇతని కావ్యలక్ష్మి కింటింటఁ బూజలు
జరుగు సమయ మిప్పు డరుగుదెంచె
నాంధ్రు లితని పూజ కట్టాడు సమయానఁ
గాలమూర్తి కొట్టె కన్నుగుట్టె

పాంచభౌతికమ్ము భస్మమైనదిగాని
తరిగిపోని కీర్తి తనువుగలదు
కృతుల కీడువచ్చు సుతు లిర్వు రున్నారు
అతని కేమిధన్యుఁ డన్నియెడల.

తాను లేనిలోటు తరతరమ్ములకుండుఁ
దనకు లోటులేదు ధరణిలోన
శూన్యహృదయమైన సూతాశ్రమము మేము
నన్నిలోటుపాట్ల కైతి మిపుడు.

కవిరాజా ! నినువంటి విశ్వకవు లీకాలప్రవాహమ్మునన్
బవలున్ రే లెదురీఁది రందసదృశ ప్రజ్ఞాప్లవ మ్మూఁతగా
భువనమ్ముల్ తలక్రిందొనర్చిన నినున్ బోనాడు పుణ్యుల్ భవ
త్కవితాత్మన్ మదిమెచ్చి నిచ్చలు నమస్కారమ్ముగావింపరే?

## ‡ శతశిల్పి

నాఁటికి నేఁడుమాయెడఁద నాటి చలింపని దివ్యమూర్తి కీ
పాటికి సానుభూతి కయి బంగరుపూవులఁ బూజసేయ కీ
'లాటి' కృతఘ్నులై రిఁకఁ గళామహిమంబు గ్రహింపలేని మా
నాఁటు తెలుంగు బాబులను నవ్వని దేశ మొకండు గల్గునే ?

ఏమని మాన మూనితిరొ ? యీమనీహాయుని శిల్పిచాతురీ
శ్రీమహిమంబు మీకనులఁ జిందదె? త్వద్గృహలక్ష్మి నిత్యమున్
ఆ మృతజీవి శిల్పకళ కంజలిపట్టదె ? తెల్గుబిడ్డలా
రా ! మఱపేల కల్గినదొ ? రత్నముజారినదే యెఱుంగరా ?

మనబిబ్బీదొరసాని గోరివిరచింపన్ షాజహాన్ భారతా
వని రక్తాంబువు లోడ్చి కీర్తిధనుఁడై వర్ధిల్లినాఁడట్టి దా
నిని నిర్మించిన శిల్పిహస్తమున సందీపింపదే బ్రహ్మకే
ల్పన చాతుర్యమఁటంచుఁ గాంగెడు భవద్భావంబుభావించెదన్

లలితకళాదరాదిక మలౌకికమందురు తద్విహీనమా
నిలు పెనువల్లకా డని రవీంద్రకవీంద్రుఁడు వల్కినట్లుగాఁ
గలకల నవ్వి చెప్పెదవు గౌరవభారత శిల్పచాతురీ
విలసన కాత్మఁ బొంగెదవు విశ్వజనీనకళాధురంధరా !

---

‡ నూతలపాటి నరసింహంగారు.

ఎన్నోసంస్థలు మాసిపోయె; మఱియెన్నేమాయు; నెన్నేనియు
త్పన్నంబై యలరారుచున్న; విది తథ్యంబైన శిల్పంబు భా
వౌన్నత్యాశ్రయసంస్థ కూలదని నెయ్యంబూని వాక్రొందువో
యన్నా ! శిల్పకళాభిమాన మిదిగాదా ? యెంత సంతృప్తిరా?

నీ కొక మంటిమందిరము నిద్దురకై విరచించి బ్రహ్మ ని
ర్వ్యాకులుఁడయ్యె నీయమృతహస్తము క్రిందయిపోయెనోయి! శి
ల్పీ ! కలకాల మిట్లయినఁబృథ్వి యమానుషసృష్టి గాదఁటో
యీ ! కరమెత్తి కుంచెఁగొన వేమి; విచిత్రవిలాససృష్టికిన్.

ఊరుపుఁగ్రొంబొగన్ మలినమొందిన బుద్ధుని ధ్యానచిత్రమం
దాఱెడు దుఃఖరేఖయనియంటివి, నైజకళావిలాస మీ
తీరని చెప్పి నవ్వితివి, దిద్దుచునంతటఁ గౌఁగిలించి మా
భారతభాగ్యధాతయని పల్కితి వర్థముగాదు పుణ్యుఁడా !

ఇది మృగతృష్ణికాజల మిదే కుధరాగ్రమునుండి జారెనో ?
చెదరిన గుండముల్ గుఱుతుసెప్పుము? పాంథులగుండెలోనిదీ
మదుపని వ్రేలఁగట్టితివి మాతృ సమాధికిముందుఁ దత్కళా
హృదయము తెల్పుమంటివిగదే యెలనవ్వునమూఁపుఁదట్టుచున్.

ఒక్కొకభావచిత్రమున కోపిక నీఱయిపోయెఁ; ద్రావఁగా
గ్రుక్కెడు లేకపోయెఁ; గనుగొన్న ధనాఢ్యులగుండె చీల్చినన్
మక్కువ చిక్కదాయెఁ; గొఱమాలిన సృష్టికి దుఃఖరేకయే
మిక్కుటమాయె; నేక్రియఁగ్రమించితివోయి!దురంతదుఃఖముల్

శిథిలబౌద్ధస్తూపశ్రేణిఁగౌఁగిట గ్రుచ్చి
మన రూపురేకలు మదికిఁదెచ్చి
తాడువాటినయజంతాగుహాల్ దిలకించి
భారతశిల్పవైభవము దలఁచి
భగ్నసింహాళ శిల్పభంగి మమ్మెదఁగూరి
హైందవ వైదుష్య మాకళించి
అమరావతీ చిత్రసముదీర్ణత గణించి
యాంధ్రగౌరవ దీప్తి కంజలించి
వలసరాజ్య కళాప్రాభవమ్ము నెంచి
చివుక లేదందువే ? మనజీవకళలు
కాని ముంతాజమహ లెల్లకాలమందుఁ
జాటదే భారతీయ విజ్ఞానమనవె ?

దిద్దితీర్చితివిగా దివ్యవైభవశిల్ప
సౌందర్యమాధుర్య సారమేమొ ?
పోల్చిచూపితివిగా పురుషసింహప్రతి
మాభీల రచనాంతరార్థమేమొ ?
ఆహరించితివిగా అఖిలాంధ్రసంస్థాన
శిల్పవిద్వజ్జన చిత్తమేమొ ?
అనుభవించితివిగా ఆనందపరిపూర్ణ
బ్రహ్మతత్వమహత్వభాగ్య మేమొ ?

కాని జయభేరి మ్రోఁగిటఁగట్టకుండఁ
దరలినావేల స్వర్గసంస్థానమునకు
ఆంధ్రపుత్రుల శిల్పకళాపణముల
విలుచుకొనకుంటివేమోయి ? విశ్వప్రేమ.

నీ జూలు మెఱవడి నీటు నిగారమ్ము
సింహతలాటమ్ము చిన్నపుచ్చు
నీమేని యంగరకా 'మజాఖా' హరాయల్
బంగాళ బాబును బారిసమరు
నీ సింహగమన విన్యాసవిలాసంబు
గామాముదురు గుండె గ్రక్కదల్చు
నీ మందహాస సందీప్తి సందోహంబు
గాంధిజీ చిఱునవ్వు గలఁచియాడు
నీ మధురముగ్ధ మోహనప్రేమభాగ్య
మనుభవించిన ధన్యాత్ముఁడాంధ్రుఁడెవఁడు ?
కాని దారిద్ర్యధర్మ మొక్కండె నిన్నుఁ
జిదిమివైచెను మడమెటు కదపకుండ

నిజముగాఁ దెన్గుశిల్పి కన్నీటిబొట్టు
చిందువండైన దన్న విశేషమేమి ?
ఇదికదా ? యాంధ్రగౌరవాభ్యుదయమహిమ
పట్టినా శతశిల్పికి బ్రహ్మరథము?

పూజ్యుఁడై కూడఁబొల్పుఱె పోవుకంటె
నూరుపేరైనలేని బికారిక్షేలు
తన సమర్థత దెలియక వనరునట్టి
యాంధ్రుఁడైపుట్టు టింతలో టని తలంతు.

తానొక దివ్యభావకలితంబగు శిల్పకళాలయంబు ని
ర్మాణమొనర్చినాఁడు పడిమాఱకమున్నె తదీయగౌరవ
స్థానము చూపినాఁడు మనధర్మము దప్పితి మింకనాంధ్రులే
పూనిక నిర్వహింతురను బుద్ధి మఱొక్కని కుండ నేర్చునే ?

గండపెండర మర్పించి కమ్మకులము
తాను ధన్యోఽస్మియనిమఱి తలఁపఁబోదు
పూజ్యగౌరవమెఱుఁగని పుడమికెపుడు
సాటి దేశాలఁ దలవంపు జరిగితీరు.

సత్కవీ !

నీ కవితాలతాంగి పయనించిన తెల్గుబయళ్ళలోన నా
జూకులు విజ్జిరాలినవి సుమ్మఖిలాంధ్రకవీంద్ర కోటిలో
నీకు లభించుగౌరవము నిస్తుల మాకవితామహత్వమా
పాకపటుత్వ మాసరసభావ మృదుత్వ మదెట్టు లబ్బెనో ?

నన్నయ చిన్నయాది కవినాథుల పోకడ లుగ్గడించుచో
నన్నము నీళులన్మఱతు వద్యతనాంధ్రకవిత్వసత్వ సం
పన్నుల గౌరవింతు విటువంటి సుధీజన పక్షపాతమే
మెన్నియుగాల దాఁకఁ దపియించిన లభ్యపడున్ మహాకవీ !

కమ్మని కావ్య మల్లుమొనగాఁ డెవఁడైన సవాలొనర్చి మా
తుమ్మలవారి యాత్మకథతోఁ దులఁదూఁగెదు జాను తెన్గు క
బ్బమ్ము రచింప లేఁడ నెదు వా దొకఁడున్నది యక్షరాల ని
క్కమ్మదిగాక నీకలము కమ్మదనమ్మటఁ జిమ్మ రేఁగెనా ?

లోకము నూపు నెత్తుగడలోఁగల దందము దానిలోన నీ
పోకడ వేరు, భావనకుఁబూనితివా ? యసమానకల్పనో
త్సేకకథల్ బయల్పడు, రచించితివా ? స్థిరకీర్తికారక
శ్రీకము లిద్ధకావ్యరసశిల్పము లుట్టిపడున్ గ్రమమ్ముగన్.

గగ్గోలెత్తిన దాంధ్రమండలము పక్కారాష్ట్రగానంబుచే
"దిగ్గాం" ధీరులు నేఁడు కన్నెఱచి శ్రీతింగూరి బంగారవుం
బగ్గీపంపిరి యెక్కవయ్యె ? కవితాపట్టాభిషేకార్థమై
సిగ్గుం జెందెద వేల నూత్నకవితాశృంగార శ్రీనాథుఁడా ?

నీకావ్యమ్ములఁబట్టిచూతు మనినన్ నిర్వీర్యశబ్దమ్ము లే
దాకాకు న్దిలకింప నెందు స్వవచోవ్యాఘాత ముల్లేవు జ
ల్పాకుల్వాకొననేమి ? నీ కృతులమూల్యవ్యాసభండారముల్
కాక ల్దేరిన గ్రంథకర్తవుసుమా ? కావ్యారిగ్రామిణుఁడా !

శ్రీమత్సింహపురీజయంతి మిళిత శ్రీఖండనీరాజన
వ్యామోహావ్యనహారి ధీరమధురవ్యాహార సందర్భముల్
మామాగాణుల మ్రోఁగునాఁడు నినుసన్మానింప లేరైరి కా
నీ ? మాతిక్కన కుజ్జమైతివని సందేశించెదిగ్వ్యూహముల్.

అవనీనాథుల సత్కృతుల్ పడసి కయ్యాలాడఁగాబూర్జువా
కవులున్నా; రదిలెస్సగాదు ప్రజసత్కారమ్ములిట్లొందువాఁ
డెవఁడో? వాఁడె కవీంద్రుఁడాతనిదె ప్రత్యేకత్వ మీనాఁడుమీ
కవితాపూజ ప్రజాదరమ్మునకుఁ దార్కాణమ్ము ముమ్మాటికిన్.

ప్రేమకథరచించి పింగళిసూరన్న
తండ్రిపేర నంకిత మ్మొనర్చెఁ
దండ్రి ధర్మగాథఁద్రవ్వి మిత్రుని తల
కెత్తినాఁడ వెవ్వ రిద్ధమతులా ?

నీ కావ్యలక్ష్మి పెండిలి
కీ కానుక లంపినాఁడ నిరువాఁగులకున్
ఈ కరణిగారవాదిక
మాకల్ప మ్మొసక మెసఁగు నాంధ్రావనిలో.

## † తెలుఁగురాజ !

అనువాదం బనుకొంటినో తెలుఁగురాజా! పొత్తమున్ విచ్చిచూ
తునుగా, చక్కని లక్ష్యలక్షణము లందున్ శాస్త్రమర్యాదలున్
దెనుఁగుంబోకల విజ్జిరాలినవిపో ? దీనన్ బ్రబంధల్ నినున్
గనులంగామక కౌఁగిలించెద రలంకారప్రమేయమ్ములన్.

అసలనువాదమేమలప దందును సంస్కృత మందు శాస్త్రమం
దసదృశమైన పద్యమిఁక నాకవిలేఖిని కూపి రాదునా ?
పసగల మూలమున్ దరిచి భావము లేర్చి సజీవభాషతో
నొసపరిమైన నీ కవితకొక్క నమస్కృతిరా ! మహాకవీ !

చంద్రాలోక మొకప్డు కొందఱకు దుస్సాధమ్ముగావచ్చు రా
జేంద్రా ! యప్పయదీక్షితప్రతిభ ప్రత్యేకించి మాబోంట్లకున్
సాంద్రామోదము గూర్పవచ్చు నుభయోత్సాహమ్ముకై నీదుని
స్తంద్రప్రాక్తన సంస్కృతాంధ్రకవితాసంపత్తి రేకెత్తెరా ?

ఆనాఁడే కళిలాధినాయకుఁడు విద్యానాథుచే నాబళ
శ్రీనర్సక్షితిభర్త మూర్తి కవిచే జీవించి రమ్మాడ్కి రా
జా ! నీచేఁ గమలాంబ, తిమ్మవిభుఁడాచంద్రార్క మీ తెల్గుమా
గాణిన్ వెల్గెద రొక్కపెట్టునబుధగ్రామైక సంసేవ్యులై.

మీకుం గూర్చు బుధుండు కృష్ణుఁడిది సంప్రీతిన్ సమీక్షించి నీ
పోకల్ మెచ్చి కృతీశుఁ దెచ్చె నతఁడేపో ధన్యుఁ డిర్వాఁగులన్
గాఁకల్ దేఱిన రాజులిర్వుర యెడన్ "కస్త్రతసందేహ" యన్
లోకోక్తిన్ దలపోసి మీకృతిని నాలోకించి హర్షించితిన్.

---

† రాజానంత ప్రశంస. పండిత, పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారు

## సెలవు

నాఁటికినేఁడుగా దరిసెనంబు లభించెఁ గళానుబంధమే
పాటిదొ ? గాని సత్కవులు, పండితు లిట్టి కళాప్రపూర్ణు లె
చ్చోటికి వత్తు రచ్చటికిఁ జూచుతలంపునవత్తు మైన మీ.
బోఁటి మహాత్ములన్ గలసి ప్రొద్దులుపుచ్చినఁ జాలు భూవరా!

విక్రమదేవవర్మపృథివీపతి నిస్తులుఁ డందు సాహితీ
చక్రధురంధరుండని భృశ మ్మనిశమ్ము నుతించుచుందురీ
ప్రక్రియఁబొల్చు భూవరులు, పండితులుం గవులైనవారు పూ
ర్వక్రమమెన్న భోజుఁడొక రాయలుదక్క మఱొక్కఁడుండెనా?

భోజుఁడు సంస్కృతమ్ముపయి పూజ్యుఁడురాయలు తెల్గుబాసపై
మోజొడగూర్చిరైనదమమో స్వరుసంస్కృతమో త్రమాంధ్రమొ
క్కోజఘటింపనేర్చిరె? సముజ్జ్వలదాంధ్రకళాసుసుమ్ములన్
బూజ యొన స్తుమయ్య ! కవిపుంగవ ! నిస్తులభావపీఠికన్.

నీ నామమ్మున కాంధ్రమండలి కళానీరాజనమ్మొత్తెనో
భూనాథా ! మిమువంటి విశ్వకవులన్ బుంభావవాగ్దేవులన్
జ్ఞానానందుల సంస్తుతింపని కళాసారస్యముల్ గాల్పనా ?
మాణిక్యమ్ము సువర్ణసూత్రరచనామర్యాదగోల్పోవునా ?

మీమది కెక్కినట్టికవి మిత్రులలో నసమానపండిత
గ్రామణి తెల్గురాజకృపఁ గల్గితి మాకతనన్ నృపాల! మా
† శ్యామకుమారుతో భవదుదారకథాదులఁ దేలుచున్ సరి
ద్భూములుదాఁటి వచ్చితిమి భూవర! మీదెసఁ గూర్మి యెట్టిదో?

శాస్త్రమున నేర్పు మందహాసమునఁ దీర్పు
క్షాత్రమున ఠీవి సిద్ధహస్తమున నీవి
తత్వమున వాఁకు నాస్తికత్వమున బాఁకు
వెన్నతో నబ్బినట్లు భావింతు మధిప!

చనవు దోఁప సుంత నెనరుప్పతిల్లఁగాఁ
బిలిచి తేనెలొలుకఁ బలుకరించి
వేడ్కసేఁత చాలు విక్రమక్షితిపాల !
ధీవిశాల సెలవు ! తే నమోఽస్తు.

---

† జంపాల శ్యామసుందర ప్రసాద్ గారు.

# హోలి

మారంగా దయసేయునేఁడిచటికన్మాటల్ చెవిన్ సోఁకఁగా
ఓరన్నా ! యిఁకనేమిచెప్పఁదుము మాయొ ళ్ళుబ్బితబ్బిబ్బులై
అరే నిద్దురపట్ట లే దతని భార్యాబంధుమిత్రాదు లే
తీరై యుందురొ ? హోలిపండువయిపో దేవారి ముంగిళ్లలో

కచ్చితమైన మా టొకటి క ద్దిటువంటి కిసానునాయకుం
డెచ్చట లేఁడు లేఁడుమునుపెన్నఁడు లేఁడొక వేళ ముందురా
వచ్చునొ ? యేమొ? కాని భగవంతుఁడెఱుంగు నతండునీవువా
క్రుచ్చిన సూత్రముల్ నడచుకొన్న పథమ్ములు వట్టిపోవలెన్.

కలవిఁకముందు నీ ప్రభకు గంటలుగట్టుక రంగయంచు మా
కులికెడు రోజు లిప్పటికిఁ గొన్ని నెత్తావులుముందుకేగి నీ
పలుకులు మేలుకొల్పులయి భారతమెల్లఁ గమించెరా ! మహో
జ్జ్వలవిజయప్రశంస లొకపట్టున గుమ్మ . గుబ్బతిల్లఁగన్.

యావద్భారతకర్షకోద్యమవిధాతా ! సూత్రధారుండవై
నీ వాడించినబొమ్మలెన్నొ ? సరపైనేఁడెక్కె నీయుద్యమ
ప్రావీణ్యమ్మును నీ పరిశ్రమను నీ పట్టుందలంజూచి మా
దేవుండన్నవి రైతులోకములు కీర్తించెన్ దిగంతమ్ములున్.

ఇల్లా లిల్లనకుండ దేశమునకై యిక్కట్లపాలై తుదిన్
జల్లంగాఁ జనుదెంచితో రయితురాజా ! యుద్ధసంక్షోభతోఁ
బిల్లంజెల్లను గూడదీసికొను కాశీగాంధ్ర నోదార్చుచున్
ఉల్లాసమ్ముగఁగొన్ని నాళ్లిచట మా కుత్సాహముంగూర్పవే !

## వెంకటాద్రి

నూటయేఁబది యేండ్లనాఁటి భూధవుఁడు
ఆంధ్రమండలపాల కాగ్రేసరుండు
తీరుతీరుగ నగ్రహారమ్ములిచ్చి
తనిపిన కలియుగ దాన కర్ణుండు
పలికి బొంకనినూత్న పాండవాగ్రజుఁడు
శరణిచ్చితిరుగని సాహసాంకుండు
కృతులు పెక్కందినకృష్ణరాయండు
ప్రజల బిడ్డలవోలెఁ బాలించినాఁడు
శక్తిత్రయమ్మును సాధించినాఁడు
అసమానమగుకీర్తి నార్జించినాఁడు
మన పూర్వరాజుల మఱపించినాఁడు.

నెమలివాహన మెక్కుసమయమ్మునందుఁ
గార్తికేయుని మాడ్కిఁగనుపట్టినాఁడు
పసిఁడిగోగర్భాన బడివచ్చినాఁడు
గోకర్ణుఁడనిపించుకొని మన్నవాఁడు
వెలలేని రత్నాలఁ దులఁదూఁగునాఁడు
అలకుబేరుని కంటె నధికుఁడైనాఁడు
అడిగినవస్తువు లర్పించువేళఁ
దఱిదప్పకందంద దర్శించువేళ
దానవాగ్రేసరుఁ దలపించినాఁడు

పల్లెదోఁపిడిచేసి భయపెట్టుచున్న
చెంచుమూఁకల గుండె చీల్పించినాఁడు
కష్టనిష్ఠురములన్ గడవందలంకి
చెప్పువారల వెతల్ చెవియొగ్గినాఁడు
సంగీతసాహిత్య సంపన్నిధులకుఁ
గొంగులో వరహాలు గురియించినాఁడు
గుడులు, గోపురములు కోకొల్ల గట్టి
మడులు మాన్యములిచ్చి నడపించినాఁడు
వైష్ణవాచారంబు వన్నెకుందెచ్చి
శివమతస్థులఁ జెంతఁ జేర్చుకొన్నాఁడు
అన్యమతములందు నభిమానముంచి
పలువుర మెప్పు సంపాదించినాఁడు

కొల్చువారల కెల్లఁ గొంగుబంగారు
కాంక్షించువారికిఁ గల్పవృక్షంబు
దర్శించువారికా దర్శస్వరూపి
పచ్చల పతకమ్ము పైఁడికంకణము
ముత్యాలహారాలు మొగలితురాయి
రత్నకిరీటమ్ము రవలపోఁగుల్లు
తీరైనభుజకీర్తు లారాజమణికి
సొమ్ముకు సొమ్ములై సొబగుఁగూర్చినవి

రాజ్యమా ? వానిది రామరాజ్యమ్ము
జన్మమా ? వానిది సర్వసాధకము
సౌఖ్యమా ? వానిది స్వర్గతుల్యమ్ము
వంశమా ? వానిది ప్రాభవాన్వితము
ఇంకేమిగావలె నీ నృపాగ్రణికి
నమరలింగస్వామి కగ్రభాగమున
నిలువుటారతిఁబట్టి నిల్చియున్నాఁడు
అమరావతీనాథుఁ డనుచు నిత్యమ్ము
వచ్చిపోయెడువారు వర్ణింతు రితని.

దెసలు మార్మ్రోఁగి నింగిపైఁగసరుకొనియెఁ
ఖాంగి మారుమ్ముల నెత్తురుపోటుపాడిచెఁ
బర్వదిన మెల్లచోమహాప్రళయమయ్యె
గట్టు దెగి నట్టి జీవసాగరముకతన.

నరగునఁబోవు రైతురథ
చక్రము క్రుంగినదోయి ! నాయకుం
డొరగెనురా ? సమర్థులెవ
రో ? భుజమొడ్డుట రేపొమాపొ సం
బరమనుకొంటి మింతటితొ
పానలపమ్ముగ వ్రాలునంచు నె
వ్వరుగుఋతింపకార? తల
వ్రాల్చు దినమ్ములు దాపురించెరా ?

చెన్నరాష్ట్రామాత్య శేఖరుండైతన
తెనుఁగు రేఖకు వన్నెఁదెచ్చినాఁడు
ఆత్మగౌరవ రక్షణార్థమై యధికార
దార్ఢ్యమేనియుఁగాలఁ దన్నినాఁడు
సర్వప్రజాపక్షసామరస్యముగోరి
జాతీయభావమ్ము చాటినాఁడు
రాజ్యాంగసూత్రనిర్మాణ దీక్షాదక్ష
చాతుర్యమును వెదఁజల్లినాఁడు

శాంతిసమరమునకుఁ గృషిసలిపినాఁడు
బీదసాదులకై గుండె పిండినాఁడు
కోర్కెకిబ్బడి ప్రేముడిగుప్పినాఁడు
కూర్మికొఱ కెంతవారిని గొలిచినాఁడు.

నడికిరేయైన గ్రుక్కెడు ముందుఁ ద్రావించి
విడిదిచ్చి కష్టము లడుగువాఁడు
తనమన భేదమున్నను జట్టమర్యాద
లడుగు దప్పక నిల్పి నడుపువాఁడు
వేగిలేచినదాది విశ్రమించెడుదాఁక
శ్రీరామపదసేవ సేయువాఁడు
అత్యుత్తమస్థాన మందిననాఁడైన
ముందు దాసునిభంగి మ్రొక్కువాఁడు
కాలుపెట్టిన జయమందుకర్మయోగి
పలికి చెల్లించుకొను ప్రజాబాంధవుండు
నామమాత్రావశేషుఁడైనాఁడు నేఁడు
దిశలుమార్మ్రోఁగ నెఱుఁగవా ? తెలుఁగుబిడ్డ !

పిప్పియొనర్చెనే బెడఁగారుదేహమ్ము
పట్టశక్యముగాని పాడుజబ్బు
మాయమ్మొనర్చెనే మహనీయు తేజమ్ము
మిడిమేలముగవచ్చి మృత్యుదేవి

భస్మంబొనర్చెనే పాంచభౌతికమెల్ల
వల్లకాటినిహవ్యవాహనుండు
మంటి పాల్చేసెనే మన్మథాకారమ్ము
మంచిచెడ్డలు లేని మాయప్రకృతి
ఏమిమిగిలినదిఁక రుద్రభూమిలోనఁ
దట్టిడెముకలు రోదనధ్వనులుదక్క
సానుతాపాశ్రువులతోడ దీనమైన
కరుణరస మొక్కడున్నదాకాశ మంటి.

గుండె నీరైతె గోలుగోలునవిలపించు
నిల్లాలిబ్రదుకెట్లు తెల్లవారు
ఆవురుమని యేడ్చుననుఁగు బిడ్డలకింకఁ
దన లేనిలోపమ్ము తలఁగుటెట్లు
కుమిలి కూలిన తమ్ముగుఱ్ఱల కీపెద్ద
గొడ్డడిపెట్టు గోల్కొను టదెట్లు
కన్నీరు మున్నీరుగా నేడ్చుచుట్టాల
కడలేని దుఃఖమ్ము లుడుగు టెట్లు
పారమెఱుఁగక మిన్నులు పడ్డచోట
నేడ్చు నాదాఱు మిత్రులకేది దిక్కు
నేఁటి కీ గొప్పదుఃఖాంతనాటకమ్ము
సానుతాపాశ్రువులతో సమాప్తమయ్యె.

ఉత్తరాయణకాలాన నూరునాడు
భోగి సంక్రాంతితోఁ దేలిపోవుచుండ
మన మునిస్వామి నాయని మందిరమ్ము
అలగోడును బాలగోడైనదోయి !

హృదయమున కెంతయూరట పదిలపడెనో ?
శ్రోత్ర యేజబ్బుమందేల ? కుదుటపడదె
ఆత్రమేలని పరుల నూరార్చునపుడు
చాటినాఁ డాతఁ డాకారసదృశగుణము.

మాయమృత్యువె యింతయమాంత మడరి
తన్నుగబళించునని యెవరెన్నరైరి
ఎల్లవారాదమఱచిర దేమొగాని
యోగమాయకు ధీబల మ్ముపరిగాదె ?

బాధ తెలియదు పరులకేపాటియైనఁ
గన్నువెన్నెలపైఁ బడికలఁచుచున్న
నోరసిలిపండు కొనుమనె నోర్పుగదుర
నేమి వాత్సల్యమో ? యిది యెఱుకపడదు

అలఁతఁగూరుచు గీతార్థ మాకళించెఁ
దలఁపునకుఁ దెచ్చెరఘురాము దర్శనమ్ము
సరసముగనవ్వె సతిపరిచర్యలకును
ఎంత నిస్పృహయో జీవితేచ్ఛమీఁద.

రంగరంగా ! యఁటంచు నర్ధాంగినపుడు
మారు పలికించి శ్రీరాముఁజేరు వేళ
నతని యాకృతిలోలీనమైన చూపు
లందుకొనఁ బోలునుత్తరాయణఫలమ్ము.
గోలుగోలున నేడ్చు నిల్లాలి నాపి
ముద్దుబిడ్డల చెక్కిళ్లు పుణికినాఁడు
ఎంచి కన్నీటితోడ దీవించినాఁడు
తీర తనవారి కంత్యసందేశ మదియె

రైతుచక్రము త్రిప్పెడు రాజరాజు
ధర్మ మరచేతఁజూపు సత్యవ్రతుండు
నీతిదప్పని కలియుగాజాతశత్రు
వీ యుగమ్మున నింక జన్మింపఁడేమొ ?

ఈ యకాలమేఘ మేమొ ? యీపిడుగేమొ ?
ఉరుము లేక రైతుశిరమువగిలె
బయలు కౌఁగిలించి బావలుసాతు వీ
వేల కోలుకొందు వింకముందు.

రైతురక్షణ ముఖ్యకర్తవ్యమనుచుఁ
బలికినాఁడోయి ! మన రైతుబాంధవుండు
దాని నెఱవేర్చి కృతకృత్యులైన యెడల
నాయనికి సానుభూతి కనపఱచినట్లె

## స్వార్థత్యాగి

మాపెద్దాపురనాథుఁడా ! త్రిదివసా
మ్రాజ్యమ్ము వేంచేసినాఁ
డాపుణ్యాత్ముని జూచుభాగ్యమిఁక లే
దా? ధర్మచింతారతుం
డాపద్బంధు వజాతశత్రువిఁక లేఁ
డా ? పంచభూతాత్మిక
మ్మైపాడైన దఖండకీర్తితను విం
దే ప్రొద్దు వెల్గొందెడున్

మాసాటివాఁ డమాంతము
మాసంఘము మేలు కొల్పు మాగధుఁడుమమున్
బాసినలోటుం దీర్చుట
కే సుకృతిజనించునో ? జనింపఁడో ? తెలియన్

ఆపరోపకార మానిస్తుల ప్రేమ
మనుభవించు వారికంతుపట్టుఁ
ద్యాగులుండరనము తన్నుమాలినధర్మ
మితనిపట్లఁ దక్కనెఱుఁగమెందు.

అమ్మహాఋషికింత ధనాశ లేదు
తన్నుఁగాంక్షించు నెడనొక ద్రవ్యమేమి ?
ప్రాణమర్పించుఁ దెన్గుమాగాణమందు
సాంబయాగ్రణి పేరింక శాశ్వతమ్ము.

అతనిచేయూఁత నున్నతస్థితికివచ్చి
కులుకు వారెందఱెందఱో కలరుగాని
అతనిసంసార మిందు చేనడుగుపట్టి
కుమిలి కూలిన దెఱుఁగరే కొంచెమేని.

అసలుజంపాలవంశీయు లార్ద్రహృదయు
లందు మాసాంబయాగ్రణి యమృతమూర్తి
ఆమహాత్ముఁడు పొడకట్టె నవ్వెడల్ల
శాంతి దేవత ముందు సాక్షాత్కరించు.

ఉన్నతోద్యోగమందుండియుఁన్ రవంత
సౌఖ్య మెఱుఁగఁడు ప్రియురాలు చన్నపిదప
బిడ్డలకు జాలిగుండె లర్పించితుదకు
నన్నదమ్ముల దుఃఖాశ్రులందినాఁడు.

ఆమధురమూర్తిస్మృతిచిహ్న మలవరించు
భార మియ్యెడ మనవారిపైనఁగలదు
దివ్యమూర్తిని ప్రేలార్చి తినుటగాదు
బైటబఁడవలె మనప్రేమభాగ్య మిపుడు.

ఇంతవారి కిసైత మెదురుకోల్ నడపి ము
న్ముందు కేల్గదియించి మ్రొక్కువాఁడు
కొండంతహాస్యమ్ము గురిసినఁబెదవులు
నొవ్వని చిఱునవ్వు నవ్వువాఁడు
తననైతికప్రవర్తన మిట్టిదనిచాట
నాల్కకుఁబోడవైన నడకవాఁడు
అనదలపైనిత్య మమృతమ్ము వర్షించి
హాయిగొల్పెడు కన్నుదోయివాఁడు
సంఘమును జీవగఱ్ఱయై సాకువాఁడు
పరులదుస్థితి కనిశమ్ము కరఁగువాఁడు
కాలగర్భమ్ములో నేఁడు కలిసిపోయె
హాతవిధికిఁ గన్నుగుట్టెనే మనఁ గలాఁడ.

సాంబ యాగ్రణి కిఁకఁ బునర్జన్మ లేదు
ఉన్నదయచేసి సంతాపఖిన్నమైన
యీకాలమ్మునఁ బుట్టింపవే మహాత్మ !
తరతరమ్ముల నీమేలు మఱవఁబోము.

## పల్లెపట్టు

తిన్నని గాలిలోనఁ దలదిమ్మని భర్త శయింపఁ జెంగటన్
వెన్నకు రూపువెట్టినటు వెల్గెడు బిడ్డను జేరఁదీసి క
న్నన్నల బుజ్జగించి "తమ" చాలని నాథుని గేలిసేయుచున్
బున్నమ వెన్నెల న్నిదురపుచ్చునొయారి హొయల్ దలంచెదన్

వీఁపునఁ బాపఁ దూఁకొనఁగ వ్రేఁగయి పయ్యెద జీరుకాడ ము
న్నోమిపిన కాలి కూఁతముగ ముందడుగల్లన నేలమోపుచున్
జూపులు భూతలమ్మునకు సూత్రముపట్టి తదేకదీక్షతోఁ
జీపురుకట్ట పుచ్చుకొని చిమ్మునొకర్తుక వీదిగుమ్మమున్.

కూఁకటిఁ బాఱఁబట్టి కొనగోళులఁ జిక్కుడలించి మల్లెపూ
రేకుజరీతురాయి సవరించి కుళాయిడి ముద్దుబిడ్డతోఁ
గేకిసలాడుచున్నఁ బరికించి ప్రియుం డరకన్నుమూయఁగాఁ
గాఁకరపాదుచెంగటఁ బకాపక నవ్వునొకర్తు సంజలో

పొగపిననాల్గుకూరలకుఁ బొత్తగు కమ్మని పిండివంటలన్
సెగచెడకుండ ముందునిడి చేరువబిడ్డఁడు చన్నుద్రావఁగా
బుగబుగనావిగొన్న వలపుల్ ఘచరించుచు శాకపాకముల్
తగినటులున్నవా యనుచు దానుభుజించెఁ బ్రియుండు మెచ్చగన్

తనమృదుహస్తతాళములఁ దాళిక లట్టిటు దిద్ది గుండ్రగా
నొనరిచి ప్రాఁతపైఁదిగిచి యూఁయెలలో నిసువంగలార్పఁగా
మిణికిన యట్టులున్నది సుమీ? యని యాత్రమెసంగ నెట్టులో
పెనమున నేయివోసి తెగఁబ్రేల్చు నొకావిడ పూరిరొట్టెలన్.

# ౩ పాయ

## అభినివేశము

రమణి ! నీహృదయాంధకారంబు రేఁగి
కన్నుదమ్ములవెలసెనే ? కజ్జలముగ
దుఃఖతోయధి లోలోనఁ ద్రొణకెనేమొ ?
బిందురూపమ్ముగా జెప్పలందునురలె.

లలన ! నీకోరికలు నిప్పులంబులగుచు
శ్వాసముఖమున వెలికిరాసాగె నేమొ ?
అంతరిక నేత్రములఁజూచి హర్ష మొంద
హృదయమునఁ బాధుకొల్పిన మదనుఁడెవఁడె ?

చింతనాపుష్పములఁబూజసేయఁ దొడఁగి
అదను గాదిది ప్రియుని యేకాంతసేవ
కడ్డనివచింపలేని నీయంతరాత్మ
భ్రూలతా వక్రిమమున సంపూర్తిచేసె.

తాను మనసావరించు సుందరుని యందు
రమణికిఁ గలట్టి గాఢానురక్తిదెలుపు
నిబిడనిశ్వాసపవననిర్నిద్రదృష్టి
ఫాలకాలేందునకు సదా జాలిగొలుపు.

అక్కటా ? మూఁగనోమున కర్థమేమి ?
నిలువునఁ గరంగిపోయె నీ లలితమూర్తి
ప్రేమజీవులకష్టంబు ప్రియజనునకు
నమితసంతాపకారి గాదా ? కుమారి !

చెప్పఁదలఁకొన్నదాని వచింపకున్న
హృదయవేదన కుపశాంతి గదురదమ్మ !
కష్టసుఖములు తుల్యభాగమ్ములగుచుఁ
బఱచిపోవును నెయ్యురపట్టఁదవిలి.

కష్టపడనేల ! కన్నీరు గార్పనేల !
చింతనావేదనమునఁ గృశింపనేల !
సకలయత్నమ్ములకు నదృష్టమ్మువలయు
ఫలమునెడ నగగూరుటవలవ దెపుడు.

జారుముడి పైటసందుగాజారిచెదరి
సారె కురలెడుకన్నీటి ధారఁదోఁగి
స్వాతికార్తె వినిర్ముక్తజలదమాల
తూఁగు భ్రమగొల్పు నీయురోభాగమందు

రేఁగిపోయిన కాటుక రేకలందు
నీడలాడెడు నీ కనీనికలనలుపు
ఊడి పడుచున్నదటనుండి యుర్విమీఁద
కశ్రుబిందులపేర ముత్యాలసేరు

ఆవు రనెఁ బక్షు లాలవాలాంబువులకు
లేచి యంబాయని గాటూరె లేఁగదూడ
సందెచీఁకటి నలుదెసలందు నలమెఁ
దల్లిపూలమ్మి వచ్చెడి తరుణమయ్యె

నిగ్గుదేరెడు గేదంగి మొగ్గవోలెఁ
దూర్పుదిక్కునఁ దో తెంచెఁదోయజారి
దిక్కులందోఁచు ప్రజలకు టెక్కులమ్మి
అస్తువిస్తయి నీ తండ్రి యురుగుదెంచు

సాంధ్యకృత్యమ్ములకు నింత జాగదేల ?
వలయునెడ రేపు మాటాడవచ్చులెమ్ము
పెంకెసన్యాసి పోర్వెట్టి చంకదిగఁడు
వారు పనివడి నేరుగావత్తురేమొ ?

నీవు నెఱులందుఁ దుఱుముని నెపముకతన
మల్లె పూజల్లి మొగమింత వెల్లఁబాఱె
దేహతాపమ్ముకతమునఁ దలివిసెడిన
కమ్మకస్తురి తిలకమ్ము చెమ్మగిల్లె

చేతనాధర్మమిదిగాదు చిక్కులందు
ధైర్యమువహించి యాపద దాఁటవలయుఁ
దల్లిదండ్రులఁ జెలుల బాంధవులఁజూడ
దౌర !యీ ప్రేమతప మద్భుతావహమ్ము.

దావమునకన్న నమితసంతాపకరము
చందనద్రవమునకన్నఁజల్లదనము
ధన్యజీవులపాలి సుధాస్రవంతి
లాఁతివారలపాలి హాలాహలంబు

స్వర్గ నరకంబు లిందు నిచ్చలు భ్రమించు
నెవ్వ రధికారు లీరాజ్య మేలుటకును ?
త్యాగశీలురు స్వర్గమ్ము స్వార్థపరులు
నరక మెల్లప్పు డనుభవింతురు సుశీల !

భావనారూఢ చిత్రప్రపంచమందు
నంకితంబయి యున్న దివ్యాకృతులకు
ధనకనక దివ్యవస్తువాహనసమృద్ధు
లంతరాయము గల్పింప వందునిందు.

ప్రొద్దు పోయిన దింక నేఁబోయివత్తుఁ
జింతపడఁ బోకుమని లేవఁజేయిదిగిచి
ప్రేమభిక్షుకి కడలేని బెంగగూరి
తిన్నని మొలుంగున వచించె దిగులుగదుర.

మన సుశీలకు గొప్ప సంబంధమున్న
నెంచి మెటనేనియును విచారింపకిట్లు
పాడియా ? యని రాచి అంపానఁ బెట్టు
నమ్మలక్కల కేబాధ లంతుపట్టు ?

అంతరము లేదు మానిర్మలాత్మలందుఁ
దనకు నే నయి నాకును దానయగుచు
వలచి వలపించుకొను తీయ తలఁపులెన్నొ !
నెలవుకొన్నవి మామనః ఫలకములను

పాపటము లేని నాముగ్ధభావసీమ
మమత లెసకొల్పి హృదయమ్ము మరసినాఁడు
తన నిరాశావిచారముల్ దలఁచినపుడు
పగులు భళ్లని లో నగ్ని పర్వతమ్ము.

ముద్దునకు నైనఁ బెద్దలముందు నిలిచి
పలికి యెఱుఁగ డొకించుక భావ మిచ్చి
ఆత్రమున నెన్నిమాఱులో యడుగఁబోయి
ఆర్ద్రహృదయుఁడు తెలుపలేఁ డాత్మగతము.

పేటదెగి ముత్తెములసేరు పెరిగినట్లు
జీవనాశ్రువు లెపుడు వర్షించుచుండు
మాలదైవము మఱచిన మఱపుగాక
సుఖవిహీనశరీరమ్ము సురుఁగ దేమి ?

పుట్టిపెరిఁగిన మానాళ్లు భోగమహిమ
ఆరుఁగాలము బ్రదికిన నర్థవాంఛ
కాని మరణము గోరఁడే మానవుండు
కామితార్థవిహీన మీకాయ మేల !

చిన్న దాప్రక్కవారింట సీత నేఁడు
వేసినన్ వేయిరూపుల వెలుఁగుచుండెఁ
గన్నువెన్నెల మొన్నసంక్రాంతి కింక
నాలుపోలేమి లేద మీ "యమ్మ" కనెడు

పొరుగు వారల పోట్లచేఁ గరఁగిగుండె
కంటఁ దడిపెట్టుచుండు నాకన్నతల్లి
గుట్టు చక్కఁగ నిలుదిద్దుకొనెడివారు
కొండపైఁ గోఁతి నైనను గొనఁగలారు.

వాఁడు దయసేయ లేదింక వచ్చెనేని
కన్య కళ్యాణ మెవ రరికట్టఁగలరు ?
అంతకును దగ్గ గంతలేదా ? మఱేమి ?
అనుచు లోలోనఁ దుకతుక లాడుచుండు.

గుమ్మమెడ సొచ్చిరేనియుఁ గ్రొత్తవారు
మొత్త చాటని కనుసైగ నొత్తిపలుకు
బంధుమర్యాద నెఱపు నేపాంథునకును
దదుపరి నిరాశచే గుండె తఱిఁగిపోవు.

పుట్టినప్పుడు సంతోషముట్టి పడును
సురుఁగు నొకకొన్నినాళ్ల కాసుఖమరీచి
రానురానిఁక బడబాగ్నిరగులుకొనును
కాన రిటువంటి దుర్భరకష్టములను.

అమృత లేపనమై తన్పునట్టిగుళిక
హాయి సేకూర్చుదివ్యరసాయనమ్ము
నిర్భరవయఃపరిస్థితి నివ్వటిల్లఁ
గూఁతు పేరిట విషవృష్టి గ్రుమ్మరించు.

ఆలజాలమ్ముగా నాట లాడువేళఁ
దల్లి దండ్రులు దూరమై తల్లడిల్లి
అలమటించెడు పసివాని నాదరించి
నాకతమ్మున నిలువెల్ల నడపినారు.

కూలి నాలియుఁజేసినఁ బోలదేమి ?
కలియొ ? గంజియొ ? ద్రాఁగినఁగడవదేమి ?
పస్తుపడి యున్న మునిఁగెడి పరువదేమి ?
ప్రాణముల కెల్లఁ బ్రాణమాపతి లభింప.

అని యోకిలించుకొనుచున్
దనకావించిన విచేష్టితము వాకొనుచున్
దనువుమఱచి తోడ్తోడన
కనుమూసెన్ కష్టగాథ కంచికిఁబోయెన్.

## ఆభిజాత్యము

**తల్లి**

ఔనురా ? తండ్రి ! నీమాట కనుమతింతు
భాగ్యవంతులతోడి సంబంధ మేడ ?
చెప్పఁగారాని నిఱుపేద చెలిమి యేడ !
చేదుమేసెడు జాతికిఁ జెప్పఁగలమె ?

గండువారికె కామ కల్లుండవైన
వీఁడు నూ వీఁడు సుమ్మని వ్రేలునూపఁ
దరతరమ్ముల మర్యాద తఱఁగిపోయి
ఊరునాఁడెల్లఁ దుకతుక యుడికిపోదె ?

ఆస్తిపాస్తుల మనకు నీడైనచోటు
అన్నివిధముల నటునిటు హాయిగొలుపుఁ
దగుదుమని బోరగిలరాదు తలకు మించి
కొంచెపడరాదు తమకున్నకొలఁదిఁ దప్పి

చిన్నవాఁడవుగావు యోజించుకొనుము
వచ్చిపోయిరి 'పూడోట' వారు నిన్న
కుచ్చెల పొలమ్ము పదివేలు గ్రుమ్మరించి
ఎంతో ? బంగారముగఁ బిల్ల నిత్తు మనిరి.

పలుకరించినఁ బాల్గారు చెలువమనుచుఁ
జిత్రముల కందెవేసిన చేయియనుచుఁ
జదువుసంగీతముల సరస్వతియఁటంచుఁ
జెప్పఁగావిందు నాత్మీయు లప్పుడపుడు.

పిల్లనిచ్చినమీఁదటఁ బేదవారు
సరిగ రాకడ పోకడ జరుపఁగలరె
ఈడవా ? బాడవా ? వారికేమి గలదు ?
కట్నములఁ గానుకలఁ దృప్తిగలుగఁజేయ.

బావమఱఁదులచదువు సంబంధములును
అత్తమామలపోషణ మాలిగోల
బిడ్డఁడా ! చెప్పఁగారాని పీడసుమ్ము
తలదగిలివచ్చునాఁటికే తెలియఁగలదు.

బందుగులఁటందుమా ? జమీాపాఱువారు
తాత తండ్రులు గొప్పహోదాగలారు
తల్లితరపున జాగీరు దారు లంత
కొదువలే దెందుఁజూచినఁ గొఱుకుకుళ్లి !

పాల వంటికొమ్ము సంపత్సమృద్ధి
తలఁతువా ? తండ్రికెదురాడఁ దగదుసుంత
హంసమైపుట్టి నత్తల నభిలషించి
పరువుమర్యాదలను భంగపఱుపకన్న !

ఓర్పుతోనున్న వేనవేలూసిపడవె ?
కాళ్ళబేరము జరిగెడి కాల మిద్ది
వలసినంత ధనమ్ముతో వచ్చు పిల్ల
కర్త యనుపించుకొనుట నాయభిమతమ్ము

కొడుకు:—

ఔర ? నీ యవివేక మే మందునమ్మ !
కలిమి లేములు శాశ్వతములె గణింప
మెన్ని సంసారములు మన యెట్టి యెదుటఁ
దాఁటుమాటుఁగఁ బోలేదె దైవగతికి

ఇట్టి దౌర్భాగ్యపద్ధతి కెన్ని కాఁపు
రములు బలియైనవో ? చెప్పరాదు తల్లి !
కూఁతు పెండిలికై కొంపగోణి నమ్మి
అల్లునిం దెచ్చి సుఖపడు టవనిఁ గలదె ?

పుట్టినిలు ద్రవ్వి తెచ్చు పూబోఁణివలన
మగని యిలు సర్వమంగళ మగుట లేదె ?
నల్లపూసలతో వచ్చు నాతివలన
వేసినన్ వేయిరూపుల వెలుఁగ లేదె ?

తల్లి:—

ఓరి దౌర్భాగ్యుఁడా ! యెంతయూహ సేసి
తెలిసి విష మారగింపఁ యత్నించినావు
అప్రతిష్ఠఁపాలు గమ్మంచు బ్రహ్మ
వ్రాసియుండఁగ నిన్నన్న ఫలముగలదె ?

కనుట పెంచుట నావంతుగాని యిట్టి
యువకతవకల దిద్దుట కబ్బగలఁడు
కట్టగట్టుక యిర్వురు గంగలోనఁ
గలియుఁ డేమైననా కేమి ? మలపకాన !

అనుచుఁ జరచర లోనికిఁ జనియెఁ దల్లి
వెఱ్ఱిబాగుల సన్యాసి వీఁడొకండు
అంతకన్నను రెండాకు లదనమాపె
అంచుజనకుండు బుజ్జవ మారఁబలుకు.

సంఘుసంస్కార మననాకు సమ్మతంబె
కానిలోకము కన్నులు గలది గాదు
విద్యగలవాఁడ వందు వివేకశాలి
వంతరము చూచుకొమ్ము రవ్వంతయైన.

వారి భాగ్యాలుభోగ్యాలు వచ్చిపడినఁ
బూట గడచెదునన్న దుర్బుద్ధిగాదు
లేఁగమామిడి నూయేల లూఁగుచున్న
కోకిలము వీయమందునే కాకితోడ

కొడుకు:—

సర్వమెఱిఁగినవారె [illegible] జాడనుడువఁ
భామరుల మాట కిఁకఁబరి పాటిగలదె ?
కంచెయే చేనుమేయ యత్నించుచున్నఁ
బూరిపుడు కెటు లభివృద్ధిపొందనేర్చు.

విశ్వమానవసోదర ప్రేమలోనఁ
దారతమ్య పరీక్షకుఁదావు లేదు
విత్తమునవారు మనకంటె వెనుకఁబడిన
మోక్షపదవికి వారిదే ముందుచేయి.

కొక్కొరోయను తొలికోడి కూఁతలోన
మేలుకొనుచుండు వారల జాలిబ్రదుకు
వ్రాలిపోయెడుభానుబింబమ్ములోనఁ
గరఁగుచుండును వారల కష్టచరిత.

సిరిగలారాదరిద్రుల చెమటపిండి
నిలుపుకొన్నారు మణిమయనిలయములను
వారికన్నీటి ధారాప్రవాహములను
గూల్చుకొన్నారు నిలువునఁగుతలమునకు

ఊరిపైనూరు నెలకొల్ప లేరుగాని
గుట్టుమట్టుగనిలుదిద్దు కొందు రెపుడు
కాయకష్టార్జితము గోరఁగలరుగాని
ఉదరపోషణకై దోసి లొగ్గ లేరు

వారు పీల్చెదు నిర్మలవాయువులను
తాండవ మ్మాడుచుండు స్వాతంత్ర్యలక్ష్మి
వారిప్రతిరక్త కణములో వలసినంత
పుష్టి, తుష్టి పదేపదే పొంగిపొరలు

ఐన నొకమాటవచియింతునానగారు !
బంధువులు కూడదని పట్టుపట్టిరేని
మూఢులై మీరలును గంగముట్టరేని
హాయిసేకూర్చు సన్యాస మైన లేదె ?

తండ్రి:—

చదువుసంధ్యలు సెప్పించి సాకినందు
కింత దుర్బుద్ధిపుట్టిన దేమి తుడకుఁ
గడుపు చెడఁబుట్టినటువంటి కొడుకు కేడ్చి
రాలిపొమ్మంచు హాతవిధి వ్రాసెనేమొ ?.

ఈఁదినాఁడను గాఁపుర మింతదనుకఁ
జుట్టుపట్టులకుం గన్ను గుట్టునటులఁ
దాతతండ్రుల మర్యాద తలఁగకుండ
నల్వురకు సమ్మతమ్ముగా నడచుకొనుము.

పొదుపుగానున్న కాఁపురంబునకుఁదుదకుఁ
జేటువాటిల్లు రోజువిచ్చేసె నేమొ ?
ఱోటఁదల దూర్చి రోఁకటిపోటులకును
వెఱవ లాభమ్ముగల్గునా ? వెఱ్ఱిగాక.

సరియె యీచైత్రశుద్ధ పంచమికిమంచి
లగ్నమున్నది తగువారలకును దెల్పి
తలబరువు దింపికొని కడదొలఁగువాఁడ
నింక నే స్వేచ్ఛకొలఁది నూరేగవచ్చు.

అనెదుతండ్రి మోహమునం దాభిజాత్యమ్ము
తల్లిపోకడలను ధనపిశాచి
తనయుహృదయసీమ ధర్మాభిరతి నెల
కొన్న దింతకెవరు మిన్నలన్న !

## * సంక్రమణము

పచ్చిక బంగారుపావడా దిగజాఱ
నీరెండ మైచాయ తీరుగేర
మబ్బుపాయలకురుల్ మలసి నీలాలాడఁ
బరిగపిట్టలపల్కు లొరపుసూప
మంచుముత్యాల దామంబులు దూఁగాడఁ
జలిగాలి యూర్పులు సందడింప
విరిమల్లెనవ్వులు గరగరల్ పచరింప
బంతిదుద్దుల కాంతి గంతులిడఁగ
పగులఁబడి యొక్కపెట్టునఁ బొమ్మలక్ష్మి
సంజకెంజాయ నలరింపఁ జక్కవచ్చెఁ
జిట్టి సంక్రాంతి మోమింత చేసికొనియె
బంతిచేమంతి మిరెపల పౌరుషమున.

* ఈగుర్తుగలవి నామాంతరమునఁ బ్రకటితములు

**పంటవలఁతి**

కాఁపు కవిమైనమాయమ్మ కన్నకడుపు
చల్లదనమును వర్ణింపఁ జతురుఁడగును
లేఁబూచిన తంగేటి పూలకోవ
మురువుగా విరఁబూచిన ముద్దబంతి

దోరగిలిపండి మాగిన దోసపండ్లు
ఎఱుపు గొలదిగువాఱిన మిరెపపండ్లు
కుఱపలై నేల జవ్వాదు వరిగచేలు
చిత్రవర్ణపటోజ్జ్వలశ్రీ వహింప

కాఁపు కన్నెల పాటలఁ గరఁగిపోయి
అల్లనల్లనఁ దూఁగు పయ్యెరల చెలువ
మలఁతియూర్పుల పోడిమి వెలువరింపఁ
బండిపోయిన సంసారభాగ్య మమృత

గర్భసౌభాగ్యలక్షణక్రమము దెలుపఁ
బ్రకృతిదేవీ సమాశ్లేష పారవశ్య
మనుభవించుచు సంక్రాంతి కర్ఘ్యమిచ్చి
పైరు పచ్చలఁ దూఁగాడెఁ బంటవలఁతి.

**హరిదాసు**

జయ రమారమణా ! హరి ! జయ ముకుంద !
అనుచుఁ జిఱుగజ్జియలు కాళ్లఁగునిసి మొరయఁ
దంబుఱా శ్రుతిచిఱుతల కింబుగూర్పఁ
బూలదండలు మెడచుట్టు దేలియాడఁ

బట్టివర్ధనములు మెయిఁ బ్రాఁకులాడ
బట్టతలమీఁద నక్షయపాత్ర మొప్పఁ
గాసెవస్త్రము జబ్బలఁ గదలియాడఁ
బరువులిడు తింగణావంత పాడుచుండఁ
జిందు ద్రొక్కుచు సాతానిజియ్య రొకఁడు
వీథిబడి వేగఁజనుదెంచు వింతఁజూచి
కలికి మ్రుగ్గుల గొబ్బెముల్ గలయనిలిపి
బంతిపూరేకు లందులోపల నిమిడ్చి
పరుగుపరుగున నింటిలోపలికి నేగి
బియ్యపుంబాత్ర గొనివచ్చి పెంకెపడుచు
దాపునకు రాఁడె కోణంగి దాస రనుచు
సారెకుం దేటి చూచు బజారువైపు.

**కోడిపందెము.**

పల్లకురులను జుంజురు ముళ్లువైచి
కుఱువకత్తులఁగొని పండ్లు గొఱికికొనుచు
నుచ్చరలు గొట్టుచునె కోళ్ల నెచ్చరించి
ఈఁక బంగారు తొడుపుల నివలఁబుచ్చి
కెవ్వుమని ఱాలనటునిటు రువ్వుకొనుచుఁ
జప్పటులఁదేలి పందెముల్ చఱచుకొనుచుఁ
బిరికివారిన కోళ్ళఁ దెప్పరిలఁజేసి
చిన్నిదొవ్వలనీర్వెట్టి మున్నుమున్న

బారులందీర్చి శకునము "బయ్యా" మనుచు
మాటిమాటికి దూబర మంత్ర మిడుచుఁ
బికిలికుచ్చులు గట్టిన రకముకొంత
పట్టుత్రాళ్లు దవిల్చిన పౌజుకొంత
కదపి చురకత్తు లారెగ్రక్కఁదలఁగట్టి
కొక్కొరోయని కూసెడి కోళ్లఁబట్టి
చింతతోఁపు బయళ్లఁ గేరింత లెసఁగఁ
గోడిపందెము లాడెదుఁ గొంతజట్టు.

**నడవడులు.**

మడులు మాన్యము లమ్మినఁ గడవ దయ్యోఁ
గలువరింతువు సంక్రాంతివలువ లనుచు
సారెచీర లిఁకెన్నాళ్లు జరుపుటమ్మ !
పుట్టినిలు గుల్లసేతువే పూవుబోణి !

లడ్డువమ్ములు పేరునేగడ్డ లురలు
నరిసెలం జేసియుంచితి నాయెఁబోయెఁ
గొణికొణలుమాని మాపిన్ని కొడుకుఁబిలిచి
తినుఁడు నేఁడైన సహపంక్తిఁ దృప్తిదీర

శారదాపీఠమున బిడ్డఁ జదువవిడిచి
మొగమునూపరు సెలవుల ముందుఁబోయి
పిల్లదానిని గొనిరండు బీతుగుడిచి
చిక్కి నగమైనదేమొ ? నాచిట్టికూన ?

కోడలా ? పుట్టినిలువారి జాడలేదె ?
చంక లెగురంగ వైచి తీసంక్రమమున
కన్న లరుదెంచి కొనిపోదు రనుచు నేఁడు
కమల నిదె తీసికొని వచ్చితిమిగదమ్మ !

అనుచు నీస్త్రీయ నెకసెక్కె మాడువారు
నల్లురకుఁగూఁతులకుఁ గబురంపువారు
క్రొత్త యుడుపులు దెప్పించుకొనెడువారు
నిలుగుల్లైన భూషల కేడ్చువారు
పిండివంటల నటకలం బేర్చువారు
నిండ్ల వాకిళ్ల బలుముగ్గు లిడెడువారు
సంతసమ్మునఁ గష్టముల్ సరకుసేయ
రక్కఱకు సొమ్ము వమ్మైన లెక్కగొనరు

నూతనవికాస మెసఁగ నీరీతి భువన
మవ్యయానందజలధి నోలాడుచుండ
వింతహృదయాలఁజొచ్చి సంక్రాంతియపుడె
తరలిపోయె నయా ! దీని తాట లొలియ

* వానకారు

(గేయము)

ఆకాశమ్మున కన్నులెత్తుకొని
కన్నులఁ బేదఱికమ్ము గీలుకొన
భగవంతునిపై భారముంచుకొని
కడుపడివిత్తెడి కర్షకులూ మా
కొవ్వుటెడ్లపైఁ గోటేరూ మా
పశువులఁగాచెడుపాలేరూ నీ
కుండలపోఁతకు గాసగానిరే ?

గొలగొల పరువిడు కొండవాఁగులూ
పసరులు గ్రక్కెడుపచ్చికపట్టులు
మోసులు వాఱెడు మొలకపైరులూ
జీబులు దేరెడు చివురుజొంపములు
అర్ఘ్యపాద్యముల నర్పించును బ
చ్చాకుపుట్టముల నందించును లే
జాజులపాన్పులు సవరించును మే
ల్పసిమిజాలరులఁ బంపించునోహో
సజలజలదమా ! స్వాగతమా !

ఏరువాక కీ వేతెంచినచోఁ
బిలపిల రాలును దొలకరిచినుకులు
గమగమ వల్చును గమ్మవాసనలు
చిలుపలుగ్రక్కును చిన్నమడుంగులు

గడబిడఁబడు వడుగండ్లు ఱాలబలె
నూరేల జారెడు నీరుపట్టుచును
తధిమికి యనుచును దాళము వేయుచు
వరరేపదముల నానందించుచుఁ
దైతక్కనుచును దడియుదురాతటిఁ
బిల్లలపాలిటి పెన్నిధి వన్నా !

చేతికొలఁది పనిచేకుఱు రైతులు
మొలకకట్టుదురు మూలవిత్తనము
లయ్యవారు మా కౌనుసాగుకని
కోపు బెడ్డజత కూర్చికట్టెదరు
పూసకూరుపుల గౌసెనలూ బం
గారు మెఱుంగుల గంటలునూ సిం
గార మొలుకు సికమోరలునూ ని
న్నందచందముల నలరించు నయో !
పూలరంగఁడా ! పుడమికిరారా !

ఉరుముల డప్పుల దరువులతోఁ గ్రొ
మ్మెఱుఁగు దీవియల మిలమిలతోఁ జి
చ్చఱ పిడుగుల గర్జనములతో మా
కడుపుకండలను గదలింపవుగా ?
దిక్కులొక్క మొగి దీవింపంగా
దివ్యవైభవము దీపింపంగా

గాదిలిప్రజలకుఁగనుల పండువుగ
గాలి రథముపైఁ గదలివత్తువా ?
పడమటి కనుములఁ బరువు లెత్తుచును
దూరుపుఁ గోనలఁ దొంగిచూతువా ?
ఖండవృష్టియని గర్హించెదుమా
కాఁపుకుమారుల కంటినీటితోఁ
బిడుకలు, పుడకలు, పిండి, పప్పులును
ఎండఁబోయుతఱి నేతెంచితివా !
సుదతులు వల్కెడు సూటిపోట్లతోఁ
దొట్టియుండ్లఁదలఁ దూర్చితివా ? మా
చాఁకలి మంగలి "సాపెన" తోఁబ
ల్చలిగాలిని వడిఁజంకఁబెట్టుకొని
పందిరిపాకల సందుదూరితివ ?
ముదివగ్గుల మామూలుతిట్లతోఁ
దఱుఁగవు పెరుఁగవు ధర్మజీవనా ?
సస్యోజ్జీవన ! స్వాదుజీవనా !
మాకేటేటకు లోకపావనా !
నీదర్శన మగు నీరసావనా !

మాటున దాఁచిన తాటి గొడుగులను
బల్లెబాబుచేఁబట్టించెదవే ?
కమతగాండ్ర కరికంఠముగూర్తువె ?
గొల్లవారితల గొంగ ళ్లిడెదవె ?

అటు నిటు పనులకునరిగెడు సతులకుఁ
జేటలు నెత్తిని దీటుకొలిపెదవె ?
కట్టి పెత్తనముగల పెద్దలచే
గుడ్డగొడుగుఁగీ లొక్కలుపఁజూతువే ?
కొమ్ములు దిరిగిన కోటీశ్వరులకుఁ
జెప్పులు చేతికిఁజేర్చి కులుకుదువె ?
మూలల మూల్గెడు ముసలమ్మలకును
దంతాలూడిన తాతయ్యలకును
పేలాలను దినఁబ్రీతికొల్పెదవె ?
చిఱుతిండ్లన్నను జెవుల్ కోసికొనఁ
బసిపాపలకును భ్రాంతికొల్పెదవె ?
చుయ్యిచుయ్యిమను జొన్న రొట్టెలూ
గుడబిడ గోడిన గోదుమకొరదులు
గరగర వేఁగిన కందిబొణి గలూ
పొర లూడ్చిన లేవరిపేలాలూ
కానుక లిత్తుము కరుణింపుము మా
పిల్లనిచ్చెదము ప్రేమింపుము మా
పొలము పుట్రలను బోషింపు మిదే
తరుణములో మము దర్శింపవనా !

నోములు నోచెడి లేమలు తావక
ఘనతకునవి నివి కాన్కవెట్టెదరు

పాలబొండ్లములు పాయసములు నా
న్బాలుం బా లుంౘ్రాలుం బప్పులు
పరువడి దినములఁ బసరుపొలంబులఁ
గుంటగట్లపైఁ గొలువై రైతులు
వానదేవుఁడా ! మీనరాశితో
నారగింపవే యమృతాన్నంబని
జడిపట్టుటకై సంప్రార్థింతురు
జాలిలేద ? మాచేలువట్టువడె
గడబిడ సేతువుగాని కురియవే ?
పేరునకుం దగు పెత్తనమేదీ ?
చిటపటచినుకులఁ జిలకరించి మా
పాపలనిండ్లకుఁ బరువెత్తింతువు
చుట్టము నీవును సూర్యోదయమున
నడుగువెట్టితిర మిడుకుదురే ? నీ
కన్నబిడ్డ లీకర్షకులూ వా
రున్న దేశ మత్యున్నతిగను మా
యున్న స్వర్గమా యన్నలచే సం
పన్నిలయంబగు భారతమూ.

## విందు

కొండ గూడెములోనఁ గోడి గూసినది
బల్లుబల్లునఁ దెల్లవాఱ నుండఁగనె
తూరుపు రేకలు తొంగిచూచినవి
పూర్వదిక్కునఁ బ్రొద్దుపొడిచి వచ్చినది

నేరెడాకుల పచ్చతోరణాలేమి ?
అలికిన చిలికిన యందమ్ము లేమి ?
శబరి కుటీర మాసమయమ్మునందుఁ
జూడఁగన్నులు లేక సొబగుగూర్చినది

దోర పండిన తీపినారింజపండ్లు
పండబాఱిన గుత్తి బత్తాయిపండ్లు
కగ్గికగ్గని కండగల జామపండ్లు
నదరుగా ముదిరిన కదళీఫలములు
పరువమ్ము దప్పని బదరీఫలములు
బుట్టలాదిగఁ గుప్పఁబోసి యుంచినది

తమ్మునితోడ మధ్యాహ్నమ్మునకును
శ్రీరాముఁ డామె కుటీరమ్ము చేరె

శబరియాశ్రమముతోడ సంబరంపడుచు
నేడద్గు లతిప్రీతి నెదురేగుదెంచి
కన్నీటఁబాదముల్ గడిగి ముమ్మారు
సాష్టాంగపడి మ్రొక్కి చాప వైచినది
ఆసీనులై రందు నన్నదమ్ములును
పండ్లబుట్టను జాపపై ముందుఁబెట్టి
సేమ మాకాంక్షించి రామచంద్రునకు
నెదురుగాఁగూర్చుండి యిట్టు లాడినది.

సీతమ్మకుశలమా ? శ్రీరామచంద్ర !
తండ్రి పోకడవిన్న తరువాతనైన
మీయయోధ్యనుజూడఁ బోయివచ్చితివ ?
ప్రజల కీయడవి లోపలనున్న హాయి
వీనులవిందుగా వినిపించినావె ?
చల్లనికడుపు కౌసల్యదోయన్న !
కన్నది నినువంటి ఘనుఁడైన సుతుని
ఎన్నాళ్లు నీకోస మెదురు సూచితిని
ఈనాఁడు దర్శన మిచ్చినావయ్యా !
కమ్మని పండ్లివ్వి కడుపారఁ దినుము
ఇవి ద్రాక్షఫలము లియ్యవి రేఁగుపండ్లు
లివి రసాలఫలమ్ము లివి జామపండ్లు
పచ్చివిగావంత పండిపోలేదు

మంచి చెట్లన్ని గాలించి తెచ్చితిని
ఈ పండ్లు చవిచూడు మీపండ్లు దినుము
అని ముందుఁ గొఱికి తీపైన పండ్లన్ని
శ్రీరామచంద్రుని చేతికందిచ్చె
శబరి యెంగిలిపండ్ల శ్యామసుందరుఁడు
ముసిముసినవ్వులు మొలకెత్తుచుండఁ
గడుపార భుజియించి గఱ్ఱునం ద్రేన్చె
శబరికినిలువెల్ల సంతృప్తిగలిగి
సంతోషబాష్పముల్ జాలువాఱంగఁ
గఱవు దీఱంగఁ జూచి పరవశంబందె
నగవాపు కోలేని మొగ మింతయయ్యె
తన మూఢభక్తిచేఁ దనువెల్ల మఱచె
నఖిలమ్ము రామ మయమ్ముగాఁ దోఁచె
నాత్మార్పణముసేసె నాదాశరథికి
నంత రాముని రూప మాత్మలో నిలిపి
అల్లనల్లన వచ్చి యాప్యాయనముగ
శ్రీరామచంద్రుని చెక్కిళ్లు దువ్వి
నిలువెల్ల ముంజేత నిమిరి ముమ్మాఱు
రామయ్యకృపచేత నాముద్దరాలు
అక్షయంబైనట్టి మోక్ష మందినది.

## గాలివాన

మొలక చిన్కులతో నవ్వు మొగము వెట్టి
జయ్యుమని వీచు పెనుగాలిఁ జంకఁబెట్టి
ఎల్ల వా రొక్కపెట్టునఁ దల్లడిల్లఁ
గదలివచ్చెదు కడగండ్ల గాలివాన !

కొంపలన్నియు సాంతము గూలిపోవుఁ
బాలువోసిన చేలన్ని నేలఁగలియు
గొడ్డుగోదలు సర్వమ్ము గోడుగుడుచుఁ
బాప మెఱుఁగవు నీగుండె పగిలిపోను ?

కణఁత లెడపెడ వ్రయ్యఁగాఁ గసరికసరి
గుండె బ్రద్దలువాఱఁగాఁ గొట్టికొట్టి
ఒడలు కొంగర వోవఁ గా సుడిసిసుడిసి
కదలిపోయెద వప్పుడే గాలివాన !

మచ్చునకు దెబ్బఁదిన నట్టి మ్రానుగలదె ?
బిగిసి వలిగొని పోనట్టి పిట్టగలదె ?
జలమయము గాని యొఱపైన తలముగలదె ?
నీవు తాండవ మాడిన నిముసమందు.

భూమితల క్రిందులై పడిపోయినట్లు
విన్నుసాంతము పెల్లున విఱిగినట్లు
సంద్ర ముప్పొంగి రొదసేయ సాగినట్లు
విఱుచుకొని మీఁదఁ బడెదవే ? వెఱ్ఱివాన !

సంద్రముల మీఁదఁ బరువెత్తు సమయమందుఁ
బెద్దనావలపైఁబడి గ్రుద్దులాడి
పరువు పర్యైన నీవను వత్సరంబు
ఆంధ్రభూమికిఁ బ్రత్యక్ష మగుదు వమ్మ !

జీవరాసులు లేనట్టి తావులందుఁ
దండనా లాడుకొన్నచో నందమగును
చివరకిట్లు శ్మశానమ్ము చేయుటకును
పల్లెలును బట్టణములె కన్పట్టె నమ్మ !

హోరుహోరున ఱెక్కల బారువెట్టి
వీచుకొందువు సుంతేని విసువులేదె ?
మందిపాపము గొట్టక మానదింత
కొంటెతన మేల ! నీ కొంప గూలిపోను.

కాఱు మబ్బు గుఱాలపైఁ గదలివచ్చి
ఊఱు ముఱుమ నీక సుంతైన మెఱయనీక
దాడివెట్టెద వింత పంతంబ దేల ?
నీవు కన్నులు దెఱచిన నిలువఁగలమె ?

ఆలు బిడ్డలు వోయి బిట్ట డలువారి
గొడ్డుగోదలకై గోడుగుడుచువారి
పొలము పుట్టలకై వలపోయువారి
కంటి నీటను గామక కరఁగిపోవె ?

## † తల్లికాన !

చివురుచేతులలోనఁ జితికిపోయెదవు
ననల పొత్తిళ్లలో నలిఁగిపోయెదవు
దురుసు కౌఁగిళ్లలోఁ గరఁగిపోయెదవు
జోలపాటలలోన సోలిపోయెదవు
కళవిళ నవ్వింపఁ గందిపోయెదవు
గారాబు త్రిప్పులఁ గలఁగిపోయెదవు
మంచి చందన మంటి మాసిపోయెదవు
రావఁటేముద్దాడ రతనంపుబొమ్మ !
పోవఁటే గుజ్జెన బువ్వకోయమ్మ !

మచ్చదీసిన చందమామ నీమోము
చిగురుటాకులు నీదుచిన్నారికాళ్లు
మురువారు వెన్నెల గురియు నీనవ్వు
నీలిమబ్బులసుదుల్ నీదు ముంగురులు
కోకిల నీ పాటకు మొగమ్మువాచు
నె న్నని వచియింతు నేజన్మఫలమెు ?
మోహనప్రకృతిలో మించి తేల్చినది
అయిన నిన్నీరీతి నాశీర్వదింతు
నందచందమ్ముల కందమై వెలసి
చిదిమిదీపము పెట్టు చెలువమ్ముగలిగి

---

నాకన్నులవెన్నెల మనవమూంచాల మధురస్మృతి.

† జననము 1941-7-5 మరణము 1944-7-5

మంచికిమంచిదై మనుము వేయేండ్లు
మలయానిలుఁడు నీకుఁ జెలిమికాఁడైన
వెన్నెలలో మెల్ల వీవన వేయుఁ
గామించి పెండ్లాండ్రఁ గలిగినట్లైన
జాబిలి దోతెంచు సాయాహ్నమునకుఁ
గలికి పల్కులునేర్వఁ దలఁచినట్లేనిఁ
జిలుక బోదను నిదే పిలువఁబంచెదను
కావలెనంటివా ? కలువ పుష్పాళ్లు
తుమ్మెద గొని పూల తోఁటకేతెంచు
గుజ్జెన నీమారు కుదువకేయున్న
రంగుకుచ్చెలఁ దెత్తురా మామగారు

మారామఁటే పొమ్మ మామయ్యకడకు
వెండి లాంతరు పట్టి వేంచేసినాఁడు
చల్లని గాలిలోఁ జందమామయ్య
జిలుఁగు చుక్కలపూలు వెలుఁగొందుమింటి
పందిరి పాన్పుగాఁ పవళించినాఁడు
చిన్నతమ్మునికన్న సింగారమున్న
ముద్దుముద్దుగ వెన్నముద్ద లిప్పింతు

* * * *

గోఁగు పూవులుదెచ్చి కొండపైకెక్కి
బంగారురథముతోఁ బరువెత్తఁడేమొ ?

త్రి వే ణి

పాలుం బెరుగు దెచ్చి పాపాయి కిచ్చి
పల్లకీ తెప్పించి పంపరాఁడేమె ?
ఉత్తది యుత్తదే యుత్తుత్తమామ
మాయసేతువ దేమె ? మాతల్లికాన !

## కడుపుచిచ్చు

మాంచాలా ! మాకడుపులు
చించితివమ్మా ! నినున్ సృజించిన తనువుల్
మంచము వట్టిన నీశ్వరు
పంచకుఁ జని మంటిలోనఁ బవళించితివా ?

ఎన్నఁ డెఱుంగనిభూముల
కు న్నడ తెంచితివి గోడు గుడిపితి వెపుడో
మన్నైన నీ స్వరూపము
కన్నుల వ్రేలాడు రేవగలు చిట్టమ్మా !

నీవంటి తల్లి ముందీ
జీవితముల కబ్బి ముద్దుసేయంగలదా ?
కేవల మజ్ఞత గాకిఁక
నీవే కృతపుణ్యులకు జనింపం గలవో ?

ఉన్నన్నినాళ్లు కన్నుల
వెన్నెలవై నేఁడుస్వప్న వీథులబడి మా
కన్నీటి కగ్గమైతివి
నిన్నీజన్మకును మఱవనేర్తుమె బిడ్డా !

ఎన్నెన్ని జన్మ లెత్తితి
వెన్నికుటుంబముల నిట్టు లేడ్పించితి వై
న నీకుఁబునర్జన్మ
మ్మెన్నడ మాకే జనింపుమో "మంచమ్మా" !

* పెండ్లి

తీరైన వెలిపట్టు డేరాలనుండి
పాగాల మొనగాండ్రు పయనించినారు
మెఱుఁ గారు బచ్చెన మేనాలమీఁదఁ
గంటి జోళులవారు కదలి ఠాక్కొకరె
వెనుకఁ బ్రక్కలఁ బైఁడి వీచోపు లిడఁగ
విల్లునమ్ములవారు వేంచేసినారు
విచ్చుకత్తులవారు వెన్నంటి నడువ
బిరుదగద్యాల వా రరుదెంచినారు
బారు చౌకాల సిబ్బంది రాఁజూచి
తటుకాపడక మేళతాళాలవాండ్రు
గరిడీలు దేరి బాకాలూఁదినారు

దిగఁబడ్డ రాణువ మొగసాలవెనుక
'సాచేత'వారు వాసాలచెంగటను
మోమోట పడువారు ముంగిళ్లచెంతఁ
బాలు వో కేమేమొ ? భాషించుకొనిరి
పిలిచి భూనాథుండు పిల్లనీఁడంచు
సామంత భూభుజుల్ సణగికొన్నారు
శివధనుర్భంగ మిస్సీపాప మంచు
శివభక్తు లొకవంక ఛీకొట్టినారు
మాకాజ్ఞ వచ్చిన మఱి చూడుఁడంచు

* వివాహాదులలో స్త్రీలుబునుపోకమఁ బాడుకొనునది.

శ్రీవారు మీసాలు చెడఁ ద్రిప్పుకొనిరి
పిలుచునందాఁక నోపికపట్టలేక
పైఁబడి విఱువఁగాఁ బరువెత్తినారు
నెట్టుకవచ్చి మన్నీ లాఘ్యులెల్ల
విలుఁదేరిచూచి వెల్వెలఁబోయినారు
తగుదు మే మని దీనిఁ దలఁబెట్టుకొన్న
నవమాన మని ఱెప్ప లాడించినారు
కొంద ఱాసాసలఁ గుర్చీలమీఁదఁ
జదికిలఁబడి దృష్టి సారించినారు
సూరెల నింతలోఁజూచి రెల్లరును
కలకలసభలోనఁ జలనమ్ముగలిగె
నిట్టమెడలవారు నిక్కిచూచుటకు
సరిగంచుపాగాలు సవరించినారు

చిఱుగంట లులియ విచ్చేసె రావణుఁడు
బోణుకుబోణుక్కన మ్రోఁగెఁ బునుకపేర్లన్ని
నలువురిపెట్టుగా నడచి మున్ముందు
పదితలల్ గదలించి పరికించినాఁడు
దోకదోక కదలిన తోడిమార్బలము
రావణరాజా ! పరా కంచు ముందు
రాకాసిమూఁకతో దూఁకివచ్చినవి
అగ్రాన వచ్చి విల్లందె నాతండు

గుసగుసల్ వోయిరి కుంభినీపతులు
ఎద దాఁకచాపమ్ము నెత్తెనో లేదా ?
చిటపటనరములు చిందు వందయ్యె
భువి దద్దరిలఁబడి బో పెట్టినాఁడు
పకపక లాడె నాపరిషదాలయము
మన్ను మేసిన తల ల్కటి యెత్తకుండఁ
జురచుర నటునిటు చూచి కేల్సాచి
పాశుపతమ్ము మా ప్రాణాధికమ్ము
విఱుతుమా ? పాపమో వెంగలులార !
చిన్నదివిల్లు మాచేవ కేమగును ?
ఏమోయి జనకుఁడా ? నామంచి దెలిసి
సీతను లంకకుఁ జేర్తువా ? లేద !
ఆమెకు నామీఁది ప్రేమ మగ్గలము
నాకయి లంకలో నాఁడుజన్మించె
సీత పుట్టువు లంక చేటుకే యనఁగ
నీయింటఁ బెంప వార్నిధిఁ ద్రోఁచినాఁడ
మామగారూ ? వత్తు మన్నింప వలయు
నోరార నడిగితి నీరీతిఁ దక్కి
ఇష్టమున్నెడ కిత్తువేని మున్ముందు
సీతాప హారణమ్ము చేసి లీలెదను

నాలంక సర్వమ్ము నాశమౌఁగాక
ఈ రెంటిలోఁగామ కేదేని జరుగుఁ
గనుగల్గుమని సభఁ గలయఁగఁజూచి
ద్వారబంధము దాపుఁజేరె రావణుఁడు

తంద్రాళ్ళువై-పోయెఁ దత్సభాస్థలము
చఱచిరి చప్పట్లు పరిహాస మెసఁగ
వ్రేటు వడ్డభుజంగ వీరమ్ముభాతి
బుస్సుబుస్సున లేవఁబోయి రానృపులు
ఇంతలోఁబదిపదా రేండ్లయీడున్న
బాలచంద్రులు సభాభవనమ్ములోన
కేన్గుగున్నలవోలె నేతెంచినారు
దండమఁటంచు వాత్సల్యమ్మెసంగ
నలువురి కంటికిఁ జలువలైనారు.
గాధేయుఁ డీబాల కంఠీరవులకు
జనరాజ్ఞచే శంభు చాపమ్ము సూపి
ఈ విల్లు విఱిచితి రేని మైథిలుఁడు
జానకి తోడ రాజ్యమ్మునర్పించు
వంపవోయీ ? పెద్దవాఁడా ! యఁటంచు
నీలమేఘశ్యాము నియమించినాఁడు
దశరథాత్మజున కుత్సాహమ్ము వొడమె

సన్నని పల్వరుసం ద్రోపులాడి
తొగరు వాతెరలందు దోబూచులాడి
నూనూగు మీసాల నునుపులోఁ దేలి
కన్నులసొరుతోఁ గలిసిన ర్తించి
చెక్కుటద్దముల పైఁ జెంగలించుచును
ముసిముసి నగవులు మొలకలెత్తినవి
రామచంద్రుని ముద్దు మోము లోనంతఁ
గలువకన్నుల కాంతి తొలకరించినది
పరిషత్తు విభ్రాంతి పడిచూచుచుండఁ

గెంగేలఁ జాపము గీలించినాఁడు
పరగఁ బ్రత్యాలీఢ పాదుఁడైనాఁడు
వఱదగుడింబోలె వంచి పట్టుటకు
గనయమ్ము సవరించి గొనయమ్ములాగ
దొడ్డచాపము రెండు తునియలై పడియె

గుబగుబలాడి దిక్కులు చెవుడ్పడియె
దిర్దిరఁ దిరిగి భూదేవి ఘూర్ణిల్లెఁ
గలఁగెఁదోయధి సప్తక మ్మమాంతమ్ము
కులపర్వతశ్రేణి నిలువునంగూలె
దిగ్గజశ్రేణులు మొగ్గతిల్లినవి

సాఁబాలు ముందుకు సర్వరా జొరగెఁ
బవమాన దృఢతర పక్షముల్ విఱిగెఁ
పుష్పవర్షము బోరుబోరునన్ గురిసెఁ
గనులప్పఁ జెప్పిరక్కడి మన్నెకాండ్రు
ఆశీర్వదించినా రార్ష దేవతలు
జయపెట్టి గాపోయి సకలభూభుజులు
చూపఱ కెనలేని చోద్యమ్ముగదిరి

పెట్టిపుట్టిన వాఁడు పిల్లవాఁ డనిరి
సర్దారు దశరథేశ్వర పుత్రుఁడనిరి
తనతల్లి కౌలస్య ధన్యురాలనిరి
సీతకుఁ దగినట్టి చిన్నవాఁ డనిరి
జనకునకుం దగ్గ జామాత యనిరి
విశ్వైక మోహన విగ్రహుండనిరి
ప్రజల భద్రమ్ముగాఁ బాలించు ననిరి
బాబయ్య దర్శన భాగ్యమ్ము కతన
మనము ధన్యుల మైతి మని సారెవొగడ
జనకుండు విని సంతసంబునన్ బాదలి
సభ మూయుఁ డని యనుచరులనుబంచె
రఘురాము విడిదికి రప్పించినాఁడు

బల్లుబల్లునఁ దెల్లవాఱకే ప్రజలు
చెప్పుకోసాగిరి సీతమ్మపెండ్లి
రవ్వంత లోన కర్ణాకర్ణికగను
ఊరి నాలుగుమూల లుడికిపోయినవి
'చప్పన్న' దేశాలు జాబు లంబంపి
రఘువంశరాజుల రప్పించినారు
మగధ మహారాష్ట్ర మత్స్యపాంచాల
బర్బరాంగ కళింగ పరిపాలకులును
నేలీని నట్టులఁ బ్రోలు నిండంగ
వెలిపట్టు డేరాలు వెలిసె నందంద
మిథిలాపురమ్మెల్ల మెఱసె నీకతన

ప్రతిరాజ మందిర ప్రాంగణమ్ములను
రత్నతోరణములు రచియించినారు
బంగారు టరఁటులు బాతించి నారు
వెలిపట్టు పందిళ్లు విరచించి నారు
నీలంపుటరుగులు నిర్మించి నారు
ద్వారాలఁ బూర్ణకుంభము లుంచినారు
ఘనసార పంకంబు గడపలన్మెదపి
పటిక నాటిచి రవ్వపై నద్దినారు
కస్తూరికలయంపి కలయంగఁజల్లి

కలికి ముత్యాల ముగ్గులు దీర్చినారు
ఆనాఁడు మిథిలాపురావాసములను
చూడఁగన్నులు లేని శోభగూరినది

శుభముహూర్తమ్మురా శుద్ధాంతజనము
కదలె నొక్కుమ్మడిఁ గళ్యాణమునకు
శృంగారరాముని సీతతోఁగూడఁ
నడవలోఁగిటఁ బెండ్లికొడుకుఁగావించి
జిలుగిడి పన్నీట జలకమ్ము లార్చి
నలుఁగులఁ దడినద్ది వలిపెముల్ గప్పి
అగరు ధూపమువైచి యార్పి వెండ్రుకలు
చిక్కుడలించి చేర్చుక్క బొట్టిడిరి

జానకి నేపథ్యమైన పిమ్మటను
మంగళధ్వనులు తురంగలించినవి
తౌర్యత్రికమ్ము వింతగ బోరుకొనియె
యాజ్ఞవల్క్యమహర్షి యాజమాన్యమునఁ
గళ్యాణవేదికఁ గైసేసినారు
అంత సీతారాములార్షమర్యాద
కగ్గమై పీఁటల నాసీనులైరి
వలసిన తంతుసర్వమ్మైనపిదప

## త్రి వే ణి

శ్రీరామభద్రుండు సీతకంఠమున
సూత్రమ్ము గట్టె నాశుభలగ్నమందు
చెయిమీఱవలెనను చేడియల్ వోఁగడ
ముత్యాల తలఁబ్రాలు ముగుద వోసినది
రతనాల తలఁబ్రాలు రామయ్య వోసె
నాదంపతుల చూపు లభిలాష లప్పు
డలవోకసిగ్గు సీమల దాఁటవెఱచె

అంతటఁ దెలవాఱ నధిపునాజ్ఞప్తిఁ
బొన్నవాహనముపైఁ బూబోఁణి తాను
నూరేగుటకు బయల్దేరి రాకడల
వీచోపులిడ మొదల్వెట్టి రాండోరులు
బంగారు దివిటీలు వట్టించినార
లానృత్తగీత వాద్యాదు లేమందు
మిఁకఁజూడ మిదియె పెండ్లికిఁబెండ్లియయ్యె
గుబగుబ పట్నమ్ము గుబ్బతిల్లినది
ఆబాలగోపాల మన్నివర్ణములు
మేడ లెక్కెను జూడ మిథిలాపురమున
ముక్కుపై వ్రేలిడి మోద మిమ్మడిగఁ
శెప్పికో సాగె నీ చిద్విలాసమ్ము

పుత్తడిబొమ్మ పూఁబోఁడి సీతమ్మ
అందచందమ్ముల కంద మీ తల్లి
పౌన్నమ్మవంటి దీ పూర్ణచంద్రాస్య
తగినట్టి మగఁడమ్మ ! ధర్మదేవతకు
రామయ్య యంద మా కామయ్యకున్న
చెంపకుఁజేరెడే సిరులీను కనులు
మలిచినట్లున్నవే కలికి చెక్కిళ్లు
ముత్యాల తొలకరే ముద్దులనవ్వు
నీలమేఘముగదే నెమ్మేనుగూడఁ
దగినట్టి పెండ్లామె దశరథాత్మజున
కీడు జోడుగనున్న దీ యిర్వురకును
కనులున్న ఫలమిందుఁ గంటి మోయమ్మ
మామయ్య యేమిచ్చె రామయ్య కనఁగ

జాంగలమ్ములు కొన్ని చదివించె నందు
రేమీయవలె నమ్మ ! యిటువంటి బిడ్డ
నర్పించెనే మిథిలాధినాథుండు
ఏడువారాల సొమ్మిచ్చెఁ గూఁతునకుఁ
బసుపుకుంకుమక్రిందఁ బట్టణాలిచ్చెఁ
గాని యెన్నఁడులేని కడు విచిత్రమ్ము
విన్నావఁటే పెండ్లిమున్న రామయ్య

మారు వేసమ్ముతో మనరాణిగారి
కెఱుక చెప్పినఁ టందు రెంతచోద్యమ్మొ ?
మునిపండ్లు సాదఁజే జనకనందినికి
పొలతికాఁపుర మింక వెలితి గానోపు
సీలోటు లేకున్న నెంత యొప్పెడిని
పాప మనస్ జెంతపడఁతి నోర్యామ్మసి
పోక చివు ళ్లుచ్చి పోవుటంజేసి
సీతమ్మమునిపండ్లుచెదరి పోయినవి
తఱుగేమి తల్లికేతట్టు చూచినను
మండలాధీశ్వరుల్ మహితవిక్రమములు
శ్రీరామభద్రుండు, సీతాకుమారి
వర్ధిల్లవలె వేయివత్సరాలనుచు
నాశీర్వదించినా రమ్మలక్కలును
జగతిలోఁజూడమీ సంబర మ్మనఁగఁ
జేసిరి మిథిలలో సీతమ్మ పెండ్లి

## నమస్కారము

మా కులపతు లందఱు నేఁ
డే కమ్మ గర్తపురికి నేతెంచిరి వీ
రీకరణి నెన్నియోమా
ళ్లేకమ్మయి చేసినట్టి దెఱుఁగరఁటయ్యా !

ఇదిగో కమ్మచరిత్రపూ ర్తియగు ఛాపే చూడు మన్నార లె
య్యాదియోఁ దిర్పతి వేల్పు ముద్దులెన రీయంగూడ దన్నార ల
య్యాద విద్యార్థుల వేతనంబులకు సాహాయ్యంబు లన్నార లి
య్యాద ప్రారంభము వీరపూజలకుఁజు మ్మన్నారు విన్నా మెటో?

మాటలుమాత్రమిప్పటికిమా హృదయంబులమాఱుమ్రోగెడున్
నూటికి నొక్కఁడున్ జరిగెనో? క్రియమాత్రము శూన్య మైనచో
సాటి కులంబులందు మన సంఘ మిఁకం దలసూపనేర్చునా ?
నాటకమాడినన్ గొలము నాశనమైచను నంతకంతకున్.

ధనపతి దంతముల్ పులియఁదగ్గమహాధనవంతు లెందఱో
మన కులమందు నుండి రథ మమ్మొక కుంట జిరాయితైనఁ జే
యని కమబాబు లేఁడయిన నప్పటి కిప్పటి కెంచిచూచినన్
మనపని నాఁడునాఁటి కనుమాన పరిస్థితి కగ్గమయ్యెరా ?'

కలరు కళాభిమాను లఱకా లిలమోఁపని పుట్టు భోగు లెం
దులకుఁ జుమండి ? బూటకముతో సరిపుత్తురు వట్టిచేతులన్
వెలికిల వేతు రిట్లయిన విశ్వకవుల్ విబుధుల్ విగాయకుల్
కులమునఁ బుట్టరేమి? యనుకో దగునా? యొకనాఁటి కేనియున్.

సరదాగ మనకమ్మ దొర ఱొమ్ముపైనింత
శ్రీ వీరగంధమ్ము చిలికినారె ?
గండపెండర మిచ్చి కవిరాజు కెవ్వడైన
స్వర్ణాభిషేకంబు సలిపినారె ?
మృతజీవి యఁట మనశతశిల్పి పవడించు
గోరిపైఁగన్నీరు గురిసినారె ?
మఱపు రానటువంటి మనరైతుబాంధవు
స్మృతిచిహ్నమొండు సృష్టించినారె ?
ఇంటికుక్కనుసామెత కిదియెసాక్షి
పేరు మటుకేఁన్నగా నేఁతి బీరకాయ
సంఘ మని తెగ బారలు సాపనేల ?
చెలఁగి గద్దెల మీఁద గర్జింపనేల ?

కలకాలమిట్టులే కనుమోడ్చియున్న మీ
బంగరుబావుటా పాడువడును
కులబలహీనతం గుర్తింపకున్న మీ
ముత్యాల గొడుగులా ? మూలఁబడును

కార్యరంగము మీఁదఁ గాల్త్రివ్వకున్న మీ
యుక్కుకత్తుల నాల్కలూడిపోవు
విశ్వకళ్యాణమ్ము వీక్షింపకున్న మీ
విజయ దుందుభి డొక్కప్రీలిపోవు
సర్వసంఘుంబు లున్నతస్థానమంది
పక్కమనినవ్వుచున్నవి పరువుచెడని
కర్మవీరుఁడవోయి ? నాకన్నతండ్రి !
మేలుకొను మభ్యుదయవేళ మీఱకుండ.

తాతలనాఁడె యందల మెక్కినామన్న
నొడినింద నీకేమి యొరుగఁగలదు ?
మనము పండిత పుత్రమాత్రుల మనుకొన్న
బ్రహ్మరథమ్మెట్లు పట్టఁగలరు ?
చిన్న నాబొజ్జకు శ్రీరామ రక్షన్న
నీవలె మే మెటుల్ నిల్వఁగలము
నిఱుపేద కన్నీరు గురిసెనా ? నీవంశ
కూట మ్మమాంతమ్ము కూలఁగలదు
పిన్నలుం బెద్ద లిలు చక్కఁబెట్టుకొనుఁడు
ఉట్టికెక్కక స్వర్గమ్ముకెట్టు లన్న !
పొరుగువారలఁగని పండ్లు పులియకున్నె
నేలవిడిచిన సాము మీకేలనండి ?

పానుగల్ గుడిమెట్ట ప్రాక్కుంభగోళాగ్ర
చండ దీధితు లాత్మసాక్షిగాఁగ
ఓరుగల్ రాజ్యేంది రోపాసనాశక్తి
మగతనమ్మున కోనమాలుగాఁగ
గండికోట మహోగ్ర కదనకౌశల్యంబు
రాజ్యకాంక్షకు రామరక్షగాఁగ
అమరావతీప్రాభ వాభ్యుదయంబులు
గౌరవమ్ముకు జీవగఱ్ఱగాఁగ
వెలిఁగి నా రోకటిపెట్టున మలఁగినారు
వారిశౌర్యాగ్ని జ్వలియింప వలయునన్నఁ
బచ్చినెత్తురు పుక్కిటఁ బట్టవయ్య !
కత్తి కలమునుగై సేసి కదలవయ్య !

నలుమూలల్ వణఁకించుచున్ గెలుపు జెండానాటుచో దిగ్విది
క్కులు కొండాడిన వందు రాతఱి దెలుంగుల్ చల్లుస్వర్ణాక్షతల్
తలపైఁగుల్కిన రుద్రమాంబ తనస్వాతంత్ర్యంబుచేఁ దెల్గుమం
డల మందున్ ధ్రువతారయై వెలుఁగదన్నా! నాఁటికిన్నేఁటికిన్.

కఱకుంగత్తుల నూఱి చెంచుల పయిన్ గాల్ద్రివ్వుచుం బచ్చినె
త్తురు ద్రావించిన వెంకటాద్రి విభుఁడెంతో శాంతిదైవాఱఁ జి
చ్చుఱపిడై రిపుగుండెగాలమయి స్వేచ్ఛన్ దెల్గుమాగాణమున్
బరిపాలించె నశేషదానకలనా వ్యాపారపారీణతన్.

అడుగులెపాప మర్రిజనులందఱుఁ దన్నెడు గుప్తదానక
ర్ణుఁడు మన కుప్పుసా మతఁడెఱుంగని సంస్థలు లేవు సాయమున్
బడయని సంస్థ లేదు నిజవంశసముద్ధరణైక దీక్షకున్
నడుమొగఁగట్టియున్ దొలఁగి నాఁడెవ రేమని నూఱిపోసిరో ?

కలఁడు కలండు చల్లపలికాంతుఁడు మాకుల మింక ధన్య మీ
కులపతి వల్లనంచుఁ దెగఁగుల్కితి మేమనుకొన్న దానికిన్
ఫలమిఁక నెన్నఁడో ? మన సభాపతి బొల్లినివారి బిడ్డపై
నిలిచిన విష్డు దృష్టు లితనిన్ మన సారథి గమ్మనన్ దగున్.

మనసారథి మనసచివుఁడు
మనబంధువు మన హితుండు మనకులపతి యౌ
మ్మని సామి లేకపోయె న
తని స్థానం బాక్రమించు ధన్యులుగలరా ?

కోరిన విద్యార్థి కొంగులో వరహాలు
కొద దీఱ నెడపెడఁ గురియుటొకటి
కడ చన్ననాయకాగ్రణుల స్మృత్యర్థమై
వీర పూజలను గావించు టొకటి
విశ్వసాహిత్యమ్ము వెలిఁగించితీరెడు
సాహితీసంస్థను సాకు టొకటి

పిలుకు మార్చెదుకట్నముల రూపుమాయించి
పరదాల శిష్టమ్ము మాపు టొకటి
ఇద్ధసంఘచరిత్ర వ్రాయించు టొకటి
ముఖ్యకార్యమ్ము లని తలపోయుఁ డన్న !
కాలచక్రమ్ము వెనుకకుఁ గదలిరాదు
ఎంతమునుపడి చేసిన నంతమేలు.

కడకు ధర్మార్థకామ మోక్షముల కంచుఁ
దగవుమాలిన వర్ణభేదములఁ బెంచి
కులము పేరిట బలిదీయఁ గులుకుచున్న
కాలమూర్తికి నా నమస్కార మన్న !

# లక్ష్మీ గ్రంథ ప్రచారిణి, తెనాలి

| | | |
|---|---|---|
| త్రివేణి | (ఏటుకూరి వేంకటనరసయ్యగారు) | 1– 8–0 |
| భగవద్గీత | (కల్యాణానంద భారతీస్వామివారు) | 5– 0–0 |
| చుక్కమ్మ | (చలంగారు) | 0–12–0 |
| వెలుఁగునీడలు | (పి. వెంకట హనుమంతరావుగారు) | 0–12–0 |
| నల్లపిల్ల | (ధనికొండ హనుమంతరావుగారు) | 0–12–0 |

## అచ్చులో

| | | |
|---|---|---|
| మైదానం | (చలంగారు) | 1–0–0 |
| అదృష్టం | ,, | 1–0–0 |
| అమీనా | ,, | 1–0–0 |

★

## నా గ్రంథములు




ఏటుకూరి వేంకటనరసయ్య

తెలుఁగు పండితుఁడు

ఎడ్వర్డు బోర్డు హైస్కూలు

నిడుబ్రోలు

రైతు : గుంటూరు సీమ రైతు సంఘము

గోవాడ


★